# వెన్నెముక కులాలు అంటరానివా?




కళాప్రపూర్ణ డాక్టర్ ఎస్. టి. జ్ఞానానంద కవి

# షెడ్యూల్డు కులాలు అంటరానివా?



కళాప్రపూర్ణ
డాక్టర్ యస్.టి. జ్ఞానానందకవి



ముఖపత్రం: శీలా వీర్రాజు

హక్కులు గ్రంథకర్తవి

ప్రథమ ముద్రణ
1997 ఫిబ్రవరి



వెల : ఇరవై అయిదు రూపాయలు

ప్రతులు : *3500*

*ప్రతులకు:*
సురగాలి ప్రచురణలు
డాక్టరు జ్ఞానానందకవి
దంతులూరివారి వీధి
పేర్రాజుపేట
కాకినాడ - 53 003



శాంతి ప్రవచనం

"బోధిసత్వుండు పుట్టిన పుణ్యభూమి
బాపుజీ జన్మమెత్తిన ప్రథితసీమ
జవ్హారుండుద్భవించిన శాంతి ధరణి
బడుగువానియేడ్పులు వినంబడగరాదు.



# నా విలోకనం

నేటి యీ హైందవ గంధవతీతలంలో కులాలు ఎలా క్రుమ్ముకుంటున్నవో కక్షలు కార్పణ్యాలలో దేశం అతలాకుతలం అవుతూ సౌభాగ్యసౌజన్యత్వాన్ని ఎలా మంటగలుపుతున్నవో ఈవేళే కాదు అయిదు వేల సంవత్సరాలనుండి చరిత్ర నెరిగిన కూలంకష ప్రజ్ఞాధురీణు లెరుగుదురు. అస్పృశ్యులు (అంటరానివారు) లేరని కేవల కల్పితాలనియు నెరుగుదురు.

కానీ, నేడు మరీ మరీ ఈ కులవ్యవస్థ పూర్తిగా పాతుకొని పోయి దేశాన్ని అథోగతికి, ఉపద్రవస్థితికి దిగజార్చింది.

ఈ కులవ్యవస్థ కూలిపోవాలనీ దీనమానవులను సముద్ధరించాలనీ, ఆరాటపడి పోరాటాలు సల్పిన మహనీయుల మానవీయతాధర్మాచరణ పరాయణత్వ సందేశాల ద్వారా యీ హైందవ భువనంను కుదిపివేశాయి. కాని మార్పు రాలేదు. గుడ్డిలో మెల్లగా సమభావ సంస్కృతిగల మహోన్నత భావుకుల కృషి కారణంగా ఈ బహిష్కృత (దళిత) జాతి పురోగమిస్తుంది. ఈ పురోగమన స్థితికి భూగర్భంలో మన్నైన ఈ నికృష్టకులాల భ్రష్ట చరిత్రకు బ్రహ్మ అయిన ధూర్త దుష్ట శాసకుండు మనువు ఎంతగా అల్లాడుతున్నాడో ఉల్లసిల్లడానికి బదులు పుల్లసిల్లుతున్నాడో పంచమజాతి అభ్యుదయానికి పృథివీ శిథిల గర్భాలయంలో ఏమయిపోతున్నాడో మరి; కాలచక్రంలో తమ సౌభాగ్యాన్ని గోలుపోయిన పంచమ జాతి మరల కాలచక్ర పరిభ్రమణంలో తన సౌభాగ్యాన్ని సంతరించుకొని తీరుతుంది. తన ప్రాచీన ఔన్నత్య వైభవ శిఖరాలను ఆరోహిస్తుంది. ఇది తిరుగులేనిది. పంచమ జాతి విజ్ఞాన వివేక విలసన చైతన్య స్పందనం ముందుకు సాగిపోతుంది. "షెడ్యూలు కులాలు అంటరానివా?" అను ఈ గ్రంథ రచనకు దోహదపడిన ఇతర గ్రంథాలకు, నా యీ రచనలోని సమస్త వాక్యాలకు భావాలకు ఆలంబన మిడిన సృష్టికర్తలైన రచనా వ్యాసులకు ప్రతిభా సంపన్నులైన రససిద్ధులు, సుప్రసిద్ధులు నిసర్గోజ్జ్వల భాసమాన హృదయులైన పత్రికా సంపాదకులకు అంటరానితనం లేనే లేదని ఆర్షభావాన్ని ఆపోశమనం చేసి సందేశమను గ్రహించిన మహామానవీయతా దృక్పథశీలురకు నా శీర్షాంజలి. ఆర్ద్రతా హృదయులైన మానవతావాదులకు అభివాదాలు.

*కాకినాడ 1-1-1997* **జ్ఞానానందకవి**



# నివేదన

ఈ అణ్వాస్త్రయుగంలోనే, ఈ కంప్యూటర్ జగంలోనే, అంటరానితనం ఎంత నీచాతినీచంగా ఘోరాతిఘోరంగా వికటాట్టహాసంతో ఈ ఆర్ష భూమి ఖండంలో విహరించేస్తుందో బ్రతుకుతున్న సర్వమానవానీకానికి అవగాహనమవుతుందని వ్యాఖ్యానింప నవసరంలేదు. ఈ యుగంలోనే వంచక వర్గం పంచమజాతికి పెడుతున్న క్రూరహింసలు దారుణమారణ హత్యాకాండలు పేట్రేగుతుంటే అడిగే నాథుడు లేని కాలంలో పంచమజాతి స్థితిగతులెలా యుండేవో యూహింపగలం. నా ఎరుకగలిగిన కాలం నుండి ఈ పంచమజాతికి జరుగుతున్న భయంకర దౌర్జన్యదౌర్భాగ్య దుష్టకిరాతక కృత్యాల్ని తలచుకుంటే శరీరం గగుర్పొడుస్తుంది. వాటిని మొత్తంగా వ్రాయాలంటే ఎంతైనా వ్రాయవచ్చును. "షెడ్యూలు కులాలు అంటరానివా?" అన్న ప్రాతిపదిక మీద నా ఆలోచన నిలిపి నా చదివిన నా ఎరిగిన నాకు దొరకిన అంటరానివానిగా నా పడిన గాథామయ జీవితాన్ని సహృదయ సంస్కార సానుభూతులు గల మాననీయుల సమక్షంలో ఈ సమకూర్చిన గ్రంథాన్ని తెరచి వుంచుతున్నాను.

పంచములు, బహిష్కృతులు, హరిజనులు, దళితులు, చండాలురు ఇత్యాది నికృష్టనామాలతో వ్యవహరింపబడి దగాపడుతున్న ఒకానొకప్పుడు బ్రతికిన ఈ జాతి కాలక్రమేణా ఎలా అగ్రవర్ణాల సహింపరాని ఈర్ష్యాద్వేషాల మధ్యలో అణగద్రొక్కబడిందో వేదాలు మొదలుకొని నేటి ఈ దుర్వాదాల వరకు ఎలా పయనించిందో వాటి మూలముట్టం గల గ్రంథాల్ని (లభ్యమైనవానిని) శ్రద్ధగా పరిశీలించి పరిశోధించి రచించిన పరిశోధకులు, కవులు, రచయితలెందరో ఎన్నెన్నో విషయాలను వివరాలను అందించారు. వారందరు అభినందనీయులు.

ఆ కోవలోనే నాకు తెలిసిన మరికొన్ని వివరాలను ఈ గ్రంథంలో ప్రచురించుట, "షెడ్యూలు కులాలు అంటరానివి కావు" అన్న యాథార్థ్యాన్ని నిరూపించుట కోసం చేసిన ప్రయత్నం సౌజన్య మూర్ధన్యులైన మానవీయలాక్షణికుల హృదయాల్ని స్పందింపచేసినచో అది నా భాగ్యవిశేషంగా తలుస్తాను.

**"సర్వ ఆశా సమ మిత్రం భవతు"**

*అధర్వణవేదం 19-15-6*

(అన్ని దిక్కులవారు నాకు మిత్రులగుదురుగాక!)

**- జ్ఞానానందకవి**



# ❁ కృతజ్ఞతాంజలి ❁

మాన్యశ్రీ నారాచంద్రబాబు నాయుడు గారికి
(ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి)

మాన్యశ్రీ కడియం శ్రీహరి గారికి
(ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమ శాఖామంత్రి)

శ్రీ సమర్‌జిత్ రాయ్, I.A.S గారికి
(ఆంధ్రప్రదేశ్ సాంఘికశాఖ ప్రిన్సిపల్ సెక్రటరీ)

శ్రీ వి. శర్మారావు గారికి
(ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమశాఖ కమీషనర్)

డా॥ సోమశేఖర్ గారికి
(ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమశాఖ సంచాలకులు)

శ్రీ రమేశ్‌చంద్ గారికి
(డిప్యూటీ డైరక్టర్ సంఘిక సాంక్షేమ శాఖ (తూర్పు గోదావరి జిల్లా)

ముఖపత్రం వ్రాసి యిచ్చిన
శ్రీ శీలా వీర్రాజు (కవి)గారికి

ప్రూఫులు దిద్దడంలోను రచనా ప్రతిని సరిచేయడంలోను సహకరించిన
శ్రీ మైనంపాటి పాండురంగారావు గారికి
శ్రీ కొత్తపల్లి వీరభద్రశర్మగారికి
చి॥ డాక్టరు యస్. శరజ్జ్యోత్స్నారాణికి

అందంగా అచ్చువేసిన
రాంషా-శిరీషా పబ్లికేషన్స్ వారికి

# దోయిలి

నవ సమాజ నిర్మాత
హేతువాది
మానవతావాది
మహారచయిత
రాజ్యాంగ రచనా శిల్పి
రచనా సంఘాధ్యక్షుడు
అపార విద్యాసాగరుడు
అన్నింటికి మించిన గొప్ప సంస్కర్త
పురాణేతిహాస గోపుర ద్వార
కవాట పంక్తులను బ్రద్దలు కొట్టి
భావ విప్లవ పతాకను హేతువాద
కుంభాగ్రంపై ఎగుర వేసిన



డాక్టరు బి.ఆర్.అంబేద్కరు శతజయంతి ఉత్సవ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సాంఘిక సంక్షేమశాఖ వారి సౌజన్య భావంతో ఆర్థిక సహకారంతో ఈ గ్రంథం అచ్చయింది.

# అభివందనాలు

"డాబు దర్పమ్ముతోడను నిబ్బరించిన
  మనువు మాటలు గొప్పవనిన వేళ
మత్తెక్కి పేద నిమ్నజులపై వర్ణపి
  శాచమ్ము కోఱలు సాచువేళ
తల్లిదేశాభ్రాన దారిద్ర్యగాఢమూ
  ఢాంధకారము దిక్కులలము వేళ
అప్రాచ్య మతదురహంకార భావమ్ము
  స్వేచ్ఛమై వాహ్యాళి సేయువేళ"

"ధర్మకంకణమ్ము దాల్చి యన్యాయంపు
టెత్తుగడల నెల్ల జిత్తు జేసి
యశము గొన్న డాక్టరంబేద్కరూ! నీకు
స్వాంతపూర్వ కాభివందనాలు"

"అచలస్థైర్యుడవీవు దక్కినదిగాదా! దేశరాజ్యాంగపున్
రచనా వ్యూహము నీకు నీయనుపమప్రజ్ఞావిశేషమ్ముకూ
రిచె నీజాతికి నున్నతి ప్రగతి తండ్రీ! నీచవశ్శక్తి సం
కుచితాత్మాళికి వజ్రఘాతమగు వాక్రువ్వన్ దయావారిధీ!"

"నీ నిలువెత్తు విగ్రహము నేడు మనీషులు హస్తినాపురిన్
పూనిక తోడ నిల్పిరిది పో! యగు గౌరవ భాజనమ్ము నీ
కో! నవనేత! సంతతమహో! పలవించును దేశ దేశముల్
దీనజనావనుండనుచు ధీరమనస్వి! యఖండ ధీనిధీ!"

"అంటరానితనంపు టడుసులో బొరలాడు
దీనజాతికి దొడ్డ తెరువు సూపి
బలిసి నిక్కుచు విశృంఖల విహారము సల్పు
కులమహాద్విపి దంష్ట్రల నణంచి
నగమెక్కి పొగరెక్కి నాట్యమాడిన మత
భుజగ కన్యక శిరమ్మును విదల్చి
వల్లమాలిన భేదభావాలు కల్పించు
ప్రాచీనతను బట్టి బయలు పరచి"

" శాంత్యహింస లురల సత్పథమ్మైనట్టి
శాక్యమౌని యడుగు జాడలందు
నడచి దీక్షగొన్న నవబుద్ధ! నిరతమ్ము
నీదు పేరు జగతి నిలుచు గాక!"

"ఈ రాజ్యాంగపు హక్కులం గనుచు నేడీ జాతి నీపుణ్యమం
చాలుల్ నూఱులుగా ఫలించుటలు విద్యావైభవోపేతసు
శ్రీ రమ్యత్వమునన్ చెలంగుటలు నిర్భీకత్వముంజాటు, మా,
యీ, రక్తమ్మున నీవె కన్పడెదవోయీ! నీకు శ్రద్ధాంజలుల్"



# అంటరానితనం గురించి వివేకానందుని మరికొన్ని ప్రవచనాలు

" ఈ కులతత్త్వ పీడిత మూఢవిశ్వాస తాడిత దయారహిత మోసపూరిత ఆస్తిక పిరికి పందల మధ్య దిక్కుమాలిన బ్రతుకు బ్రతుకుతూ చచ్చిపోవడానికేనా నేను పుట్టింది."

"We have brains but no hands, we have the doctrine of Vedanta but we have not the power to reduce it practice. In our books there is the doctrine of universal equality, but in work we make great distinctions".

"మనకు మెదడు వుంది. చేతులులేవు. గొప్ప వేదాంతముంది దానికి వాస్తవ రూపమిచ్చే శక్తి లేదు. మన గ్రంథాలు విశ్వజనీన సనాతను బోధిస్తున్నాయి. మనం మాత్రం చెప్పరానంత అసమానతను పాటిస్తూన్నాం."

"We are orthodox Hindus, but we refuse to indentify ourselves with "don't touchism" that is not Hinduism. It is in none of our books. It is an unorthodox superstition which has interfered with national efficiency all along the time."

"మనం సనాతన హిందువులం. "నన్ను ముట్టుకోకు" అనేది హిందూమతం గాదు. మన ఏ గ్రంథంలోను ఇది లేదు. ఇది అసనాతమైన ఒక మూర్ఖత్వం. ఈ "నన్నుముట్టుకోకుతనం" మధ్యలో మనకు అంటుకొని మన జాతీయ సామర్థ్యాన్ని నాశనం చేసింది."



## శ్రీరాముడెవరు? భారతం ఎవరి గురించి?

"శ్రీరాముడు బ్రాహ్మణేతరుడుగదా! వారలను భగవంతుడని, అన్ని వర్ణములవారు పూజించటలేదా? పన్నిద్దరాళ్వారులలో పెక్కండ్రు బ్రాహ్మణేతరులు లేరా? వారిని దేవతార్చన పెట్టెలలో నుంచుకొని పూజించుటలేదా?

**భారతము** బ్రాహ్మణేతరులైన పాండవుల చరిత్రయే గదా! దానికి పంచమవేదమని పేరు పెట్టి దానిని బ్రాహ్మణులు పారాయణము చేయట లేదా?

విశ్వామిత్రుడు బ్రాహ్మణేతరుడు గాడా? మహాపవిత్రమైన గాయత్రీ సూతుడు గాదా నిర్మించినది.

వేదవ్యాసుడు ఎవరు? పల్లెదానికొడుకు. అతడే పంచమవేద రచయిత. అతడే నాలుగు వేదములు విభజించెను. అతడే పదునెనిమిది పురాణములు రచించెను. వాటినన్నిటిని బ్రాహ్మణాదులు శిరసావహించటలేదా? బ్రాహ్మణేతరులెవ్వరు? బ్రాహ్మణులెవరు?

**(మతమౌఢ్యానికి వ్యతిరేకంగా - పరకాల పట్టాభిరామారావు**
**చిలకమర్తి స్వీయ చరిత్రం - సింహావలోకనం)**

### కుల, మత, వర్ణ వ్యవస్థలపై గురజాడ నిశిత విమర్శ

మతం ఏర్పరచిన కుల, మత, వర్ణ వ్యవస్థలను మహాకవి గురజాడ నిశితంగా విమర్శించాడు. మన వర్ణధర్మం ఎంత అధర్మమైనదో మహాకవి చెబుతూ అస్పృశ్యతను నిరసించారు. లవణరాజు కల అన్న గేయ కావ్యంలో ఇలా అన్నారు.

**"మలిన వృత్తులు మాలవారిని**
**కులము వేర్చిన బలియురొకదే**
**శమున కొందరి వెలికి దోసిరి**
**క్రూరకర్మలకున్"**

**"మలిన దేహుల మాలలనుచును**
**మలిన చిత్తుల కధిక కులముల**
**నెలవొసంగిన వర్ణ ధర్మ**
**మధర్మ ధర్మంబే-"**

మనుషులలో రెండే రెండు కులాలున్నాయి. ఇన్ని కులాలులేవు. మంచి చెడ్డలు రెండే రెండు కులాలు అని మహాకవి మహోదాత్తమైన మహోన్నత మైన భావాలను ఇలా వెల్లడించారు.

**"మంచి చెడ్డలు మనుజులందున**
**యెంచి చూడగ, రెండె కులములు**
**మంచియన్నది మాలయైతే**
**మాలనే అగుదున్"**

మంచి అన్నది ప్రధానంగాని కులం అన్నది ప్రధానంకాదనీ అగ్రకులాల వారైనా మలినచిత్తులైతే వారు హీనులేనని, మలిన దేహులైనంత మాత్రాన మాలలను అంటరానివారుగా హైన్యపర్చడం అధర్మమనీ, మంచి అన్నది మాల అయితే తాను మాలనే అవుతానని మహాకవి గురజాడ ఆనాటి వర్ణ వ్యవస్థను శాసించే కులపెద్దలకీ మతాధిపతులందరకీ ఒక పెద్ద సవాలు చేశారు.

*(మత మౌఢ్యానికి వ్యతిరేకంగా - పరకాల పట్టాభిరామారావు)*



# కులతత్వంపై అభిశంసన

కులవిభజనను, అగ్రకులాల అహంభావాన్ని, నిరంకుశత్వాన్ని, పీడనను వేమన ఢీకొన్న తీరు మూడువందల యేండ్ల క్రితమే కులవ్యవస్థపై, అస్పృశ్యతపై ఆయన ఎత్తిన ధ్వజం - నిజంగా తెలుగు దేశంలో సామాజిక విముక్తి పోరాటానికి, సాంఘిక పునరుజ్జీవనోద్యమానికి బీజాలు వేసినవనడంలో ఎంత మాత్రం అతిశయోక్తి లేదు. శూద్రులనీ, మాలలనీ సమాజంలో హెచ్చుతగ్గులను సృజించిన హిందూమతాన్ని వేమన ఇలా నిలవేస్తున్నాడు.

**"మాలవానినేల మహిమీద నిందింప**
**నొడల రక్తమాంస మొకటిగాదె**
**వాని లోన మెలగు వాని కులంబేది?**
**విశ్వదాభిరామ -**

కులభేదాలను సమూలంగా నాశనం చేయాలని వేమన ఇచ్చిన పిలుపు సాంఘిక విప్లవానికి ఇచ్చిన పిలుపు"

***(మతమౌఢ్యానికి వ్యతిరేకంగా - పరకాల పట్టాభిరామారావు)***



# ఋగ్వేదంలో

ఋగ్వేదంలో ఆత్మలేదు. బ్రహ్మలేడు. మోక్షం లేదు. విగ్రహారాధన లేదు. (కొన్ని చోట్ల ఋగ్వేదంలో ఆహారాన్ని కూడా "బ్రహ్మ" అన్నారు.)

మరో ఆసక్తి కరమైన విషయ మేమిటంటే ఋగ్వేద ఋషులు నిస్సంకోచంగా మహాపాపమైన గోహత్య చేస్తున్నామన్న పాపభీతి కూడా లేకుండా గోమాంసం ఆరగించేవారు.

*(ప్రాచీన భారతదేశంలో ప్రగతి సాంప్రదాయ వాదం)*
*వల్లంపాటి వెంకట సుబ్బయ్య)*

"ఆదిమభాషయై భువనమంతట రంజిలు దేవ భాషయం
దాది మహాకవీంద్రుడయి యాది మహాకృతికర్తయై మహేం
ద్రాది సురార్చితుండయి మహామునిచంద్రుడునైన అమ్మహా
వేదవిదుండు వాల్మికి పవిత్రుడు మున్ను నిషాదుడే కదా!"

"వేదవిభాగమున్ సలిపె విశ్వము సర్వము ప్రస్తుతింప అ
ష్టాదశ సత్పురాణములు శస్తమతిన్ రచియించె సర్వలో
కాదరణీయమైన యితి హాసము భారతమున్ రచించెన
బ్జోదరువంశసంభవము నొందెను వ్యాసుడు నిమ్నజాతుడే!"

*(నిరుద్ధభారతము - శ్రీమంగిపూడి వేంకట శర్మ)*

ఋగ్వేదకాలంలో కులవ్యవస్థ వుండేది కాదు. వర్ణవ్యవస్థ (వృత్తులు) మాత్రం

"నేను వేద మంత్రాలను పఠిస్తున్నాను
నా తండ్రి వైద్యుడు
నా తల్లి పిండిదంచే మనిషి"

# కష్టజీవుల ద్వారానే భారతదేశ నిర్మాణం

**నవభారతదేశం కష్టజీవులైన కోటాను కోట్ల పేదప్రజల (ఈ పేద ప్రజలలో షెడ్యూలు కులాలు కూడా) శ్రమ నుండే ఉద్భవించుతుంది.**

**- వివేకానంద.**

"నవభారత దేశం కర్షకుని గుడిసె నుండి అతని నాగలి నుండి, మత్స్యకారుల గుడిసెల నుండి ఫ్యాక్టరీలనుండి, గనుల నుండి పనుల నుండి ఉద్భవించుగాక! ఈ సామాన్యప్రజలు వేలకొలది సంవత్సరాల నుండి నిరంకుశత్వం అనుభవించారు. మాటమంతీ లేకుండా, గొణగకుండా సణగకుండా సుదీర్ఘకాలం బాధలు అనుభవించారు. ఇలా బాధలు అనుభవించడంలో వారు ఎక్కడలేని ఓర్మి, కష్టసహిష్ణుత, జీవశక్తి పొందారు. పిడికెడు తిండి గింజలతో జీవించుతూ వారు ప్రపంచాన్నే ఘూర్ణిల్ల చేయగలవారు. వారికి అర్ధాకలితోనైనా అన్నం లభించేటట్లు చేస్తే వారికి శక్తి సంపన్నతలకు ఈ ప్రపంచపు హద్దులే సరిపోవు. "రక్తావిజు"ని లాంటి జీవశక్తిని అపారముగా వీరుకల్గి ఉన్నారు. రక్తావిజుడు ఒకదానవుడు. వాడి ఒక రక్తం బొట్టునేల మీద పడితే ఒక్కొక్క దానవుడు ఉద్భవించుతాడని దుర్గాసప్తశతి అనే కావ్యంలో కథ ఉంది. ఈనాడు శుష్క దేహాలతో కంకాళాల వలె ఉన్న వీరే రేపటి మీ వారసులు. భావిభారత నిర్ణేతలు."

కర్షకులు, చర్మకారులు, వీధులు తుడిచేవారు, వళ్ళువంచి తదితర అట్టడుగు నుండి జీవించుతున్నవారు పనిచేయడానికి తమ మీద తాము ఆధారపడి ఉండడానికి స్వావలంబనకు ఎక్కువ అలవాటుపడి ఉన్నవారు- వారే యుగయుగాల నుండి కష్టపడి పనిచేసి, దేశంలోని సంపదనంతా సృజించుచున్నారు. త్వరలో వారు మీకంటే ఎక్కువ స్థానం పొందుతారు. ఇంతకాలం మీరు వాళ్ళను అణచి పెట్టారు. ఈ రోజున వారు ప్రతీకారం చేసే రోజు వచ్చింది.

....వాళ్ళు ఒక రోజు పని చేయడం మానివేస్తే మీకు తిండి, బట్ట ఎక్కడ నుండి వస్తాయి? కలకత్తా వీథులు తుడిచే వారు ఒక రోజు పనిమానివేస్తే నగరం కల్లోలపడిపోతుంది. మూడురోజులు సమ్మెచేస్తే అంటుజాడ్యాలు ముంచెత్తించి నగరం నిశ్శేషమౌతుంది. కష్టపడేవారు పనిమానివేస్తే మీకు ఆహారం, వస్త్రాల సప్లయి నిలిచిపోతుంది. వాళ్ళను మీరు తక్కువకులంవాళ్ళు అని యీసడిస్తారు. మీ సంస్కృతిని పొగడుకుంటారు.

'వాళ్ళు మీరు చదివినట్లు పుస్తకాలు చదివి ఉండకపోవచ్చు. మీవలె దర్జీ తయారీ నాగరికతను' (టెయిలర్‌మేడ్ సివిలిజేషన్, అంటే డాబుసరి దుస్తులు ధరించేది) నేర్చుకోకపోవచ్చు. కాని సకలదేశాలలోను జాతికి వారే వెన్నెముకలు''

*(యూరప్ పర్యటన స్మృతులు- (వివేకానంద)*
*మతమౌఢ్యానికి వ్యతిరేకంగా - పరకాల పట్టాభిరామారావు)*



# డాక్టరు జ్ఞానానందకవి ముద్రిత రచనలు

| | |
|---|---|
| తరంగమాల | - 1944 |
| వసంతగానము | - 1947 |
| గాంధి (అమరగీత) | - 1950 |
| "దేశబంధు" అయ్యదేవర కాళేశ్వరరావు | - 1956 |
| పాంచజన్యము | - 1956 |
| ప్రభంజనము | - 1959 |
| పర్జన్యము (తొలిభాగం) | - 1959 |
| గోల్కొండ | - 1963 |
| క్రీస్తు శతకము | - 1963 |
| క్రీస్తు చరిత్ర (వచనం) | - 1963 |
| విజయాభిషేకము | - 1966 |
| పర్జన్యము (మలిభాగం) | - 1969 |
| అక్షరభిషేకము | - 1971 |
| ఆమ్రపాలి | - 1972 |
| అక్షరాక్షతలు | - 1973 |
| అక్షరగుచ్ఛము | - 1975 |

| | |
|---|---|
| వెలుగుబాట | - 1976 |
| క్రీస్తు ప్రబంధము (తొలిభాగం) | - 1992 |
| నా జీవిత గాథ (తొలిభాగం) | - 1977 |
| అక్షరపూజ | - 1977 |
| పిల్లనగ్రోవి | - 1982 |
| రాజధాని | - 1987 |
| వంశధార | - 1989 |
| The Vision in the Verses of Dr. Gnanananda Kavi | - 1990 |
| కూలీ నుంచి కళాప్రపూర్ణ వరకు | - 1988 |
| ఆహ్వానము | - 1993 |



## అముద్రిత రచనలు

నా జీవిత గాథ (మలిభాగం)

నా జీవిత గాథ (మూడవ భాగం)

క్రీస్తు ప్రబంధం (రెండవ భాగం)

రెండంకితాలు

ఆరు దశాబ్దాల కవితా పరిశ్రమ

కనకాభిషేక-గండపెండేరాది సన్మాన సంచిక

అభినందన గద్య పద్య ప్రశంసా వ్యాస
సంపుటీకరణము.

# బిరుదులు

| | | | | |
|---|---|---|---|---|
| కవితా విశారద | - | విజయనగరం | - | 7.12.1947 |
| కవికోకిల | - | విజయవాడ | - | 20.5.1950 |
| కవిలోకవిభూషణ | - | కాకినాడ | - | 24.4.1961 |
| విద్వత్కవిచూడామణి | - | కాకినాడ | - | 10.11.1963 |
| సాహితీవల్లభ | - | కాకినాడ | - | 15.11.1963 |
| మహాకవి | - | కాకినాడ | - | 27.1.1974 |
| కళాప్రపూర్ణ (డాక్టరేట్) ఆంధ్ర విశ్వవిద్యాలయం (విశాఖ) | | | - | 3.8.1974 |
| అభినవ జాషువ | - | విజయవాడ | - | 29.9.1974 |
| సాహితీ కృషీవల | - | చిలుకలపల్లి (బొబ్బిలి) | - | 28.9.1975 |
| కవిసార్వభౌమ | - | కాకినాడ | - | 28.10.1982 |
| కవితా శ్రీనాథ | - | రామచంద్రపురం | - | 28.9.1982 |
| పద్య విద్యా ప్రభువు | - | హైదరాబాదు | - | 30.10.1982 |
| బ్రాహ్మీవిభూషణ | - | కాకినాడ | - | 07.2.1991 |
| డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్) పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం | - | హైదరాబాదు | - | 16-11-1996 |



# షెడ్యూలు కులాలు - అంటరానివా?

" ఆర్యా స్త్రైవర్ణికా" - గౌతమ ముని
" చాతుర్వర్ణ్యమ్ మయా సృష్టమ్ గుణ కర్మ విభాగశః"

- శ్రీకృష్ణుడు.

"నాస్తితు పంచమ" - స్మృతి.
"పృథివ్యాదిభి ర్జాయంత ఇతి పంచమః"

- లింగా భట్టీయము.

గౌతమ ముని ఆర్య సంఘము నందు మూడు వర్ణములు మాత్రమేనని అన్నాడు.

గుణ కర్మ భేదతా హేతువు చేత నాల్గుకులాలు నా వలననే నిర్మింపబడినవని శ్రీకృష్ణుడు వాక్రుచ్చినాడు.

పంచమ వర్ణము లేదని స్మృతి ఘోషించుచున్నది. పృథివి మున్నగు పంచ భూతములచే పుట్టిరి కావున పంచజనులని లింగాభట్టీయము వాకొన్నది.

హిందూదేశమును పీల్చి పిప్పిచేయుచున్న యీ కుల సమస్య సుమారు నాలుగైదు వేల యేండ్ల నుండి నేటికిని నిరాఘాటముగా నిరాటంకముగా ఊమ్మ విఱుచుకొని యథేచ్ఛగా వర్తించుచున్న దనుట సత్య దూరము గాదు.

కులము, వర్ణము, జాతి అను పదాలు విభిన్నార్థములు కలవైనను నేటి కాలమున నివి సమానార్థకాలుగానే వ్యవహరింప బడుచున్నవి. ఈ వర్ణోత్పత్తి

గుణించి ప్రతిభారతీయుడు, ప్రతిసంస్కారి, ప్రతికులాభిమాని అవగాహనము చేసికొన గలిగిన నాడు దేశముయొక్క ఉజ్జ్వల భవిష్యత్తు మరీ పరాకాష్ఠ నందుకో గలదనుటలో ఎట్టి సందేహము లేదు.

గౌతమ ముని అభివర్ణించిన మూడు కులములు మాత్రమే నాటి మానవ సంఘమునకు మణిదీపాలుగా ఉన్నట్టు తెలియ గలము. నాడు మానవులలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు మాత్రమే మానవ శబ్దవాచ్యులుగా పరిగణింపచేసిన గౌతమ ముని ధార్మిక చింతనములో విశ్వైక సమతా దృష్టిలో మిగిలిన మానవులు మానవులు కారని వారిని వెలికి త్రోసివేసినాడు. గౌతముని కన్న తరువాతివాడగు శ్రీకృష్ణుడు ద్వాపరయుగమున నాల్గవకులమును సృజించి "చాతుర్వర్ణ్యమ్ మయా సృష్టమ్ గుణ కర్మ విభాగశః" అని ఆ నాల్గు వర్ణాలు నాచేత సృజింపబడినవని ఢంకా బజాయించి, గౌతమముని అభివర్ణించి శాసించిపోయినకులాల జాబితాలో దీనిని జేర్చి, నాటిదనుక మానవశబ్దవాచ్యులుగా మననట్టి వారికి, మానవశబ్దవాచ్యత చేకూర్చి, తన యౌదార్యమును, రాజకీయ సాంఘిక నైపుణ్యమును బహిర్గత మొనరించినాడు.

గౌతమ ముని కాలమునాటికి ఉన్న ఆర్యులకు అంతకు ముందున్న ద్రావిడులకు ఎట్టిసంబంధ బాంధవ్యములుగాని, మాటా మంతిగాని, వరుసకు సంభాషించు కొనుటగాని జరుగనే లేదని రూఢిగా చెప్పవచ్చును.

క్రీ.పూ. 1500 సంవత్సరమున ఆర్యులు హిందూ దేశమునకు మధ్యాసియా నుండి వచ్చి అంతకు పూర్వము నుండియు నిచట నివసించుచున్న ద్రావిడజాతి (ఆదిమవాసులు) తో కలహించినారని చరిత్రలు ఉద్ఘోషించుచున్నవి. ఈ కలహాలలో పరాజితులైన వారిని ఆర్యులు బానిసలుగా చేసికొనిరి. అదియుగాక వీరితో అనులోమ, విలోమ వివాహములు కూడ నెఱపికొనిరి. వీరికి జనించిన వారికి నొక వర్ణము తగిలించినారు. ఆర్య అనార్యుల సంపర్కము వలన సంకీర్ణ జాతి ఆవిర్భవించినది. కాని, యిందు ఒకటి మాత్రము పవిత్రమైనదని వర్ణ శూద్ర జాతి సాంకర్యము గానిదని ప్రశ్నించుటకు వీలు లేదు. అసలైన ఆర్యులు లేరని యర్థము. ద్రావిడులు ఆర్యులకంటె భిన్నులు కారనియు, ద్రావిడ శబ్దముయొక్క

పూర్వరూపము "ద్రమిళ" యనియు, ఇది ప్రాకృతపద మనియు, ధమిళ అనగా బుద్ధధర్మమును అవలంబించిన దేశమనియు ద్రమిళ పదమునుండియే ద్రమిళ, ద్రవిడ శబ్దములు పుట్టినవని విజ్ఞుల అభిభాషణము.

కేవలము ఆర్యులతో షరీకై సంబంధములు పెట్టుకొన్న ద్రావిడులు వారితో గలసి మెలసి జీవించిరి, పౌరుషము, పరాక్రమము ఆత్మాభిమానము గలిగిన ద్రావిడులు వారికి లోబడ నొల్లక వారి గ్రామాల వెలుపలనే జీవింపసాగినారు. మఱికొందఱు అరణ్యముల లోనికి పోయి నివాసము లేర్పరచుకొన్నారు. గ్రామాల వెలుపల నున్నవారే ఆదిమాంధ్రులు. వీరే అస్పృశ్యులుగా బహిష్కృతులుగా పరిగణింపబడిరి. గాంధీమహాత్ముని పుణ్యమా యని యీ జాతి వేఱొక నూతననామము ధరించినది. అదే 'హరిజన' నామము. ఈ 'హరిజన' శబ్దమునందుగల యౌచిత్యమును గురించి నేడు విద్యాధికులైన హరిజను లెందరో తమ సందేహములను వెలిబుచ్చినారు. ఏది ఏమైన మహాత్ముని యాశీర్వచనము వీరికి కలుగుట గొప్ప అదృష్టము.

మనువు తానొక ధర్మశాస్త్రమును రచించి అందు 'నాస్తితు పంచమ' అని ఘంటాపథముగా నొక్కి వక్కాణించినాడు. ఈతని కాలము నాటికే నాల్గు కులాల వ్యవస్థ శిథిలావస్థయై వినూతన సంకీర్ణులావిర్భవించి విజృంభింప దొడగినారు. నాలుగు కులాలలోనివారికి జనించి యేకులానికి జెందకుండ నున్నవారు వేఱొకకులము తమకు కావలయు నన్న గాఢవాంఛచే నాటి సంఘమున నినాదాలు చేయగా మనువు దాని నెట్లయినను తలయెత్తనీయకుండ నాల్గు కులాలతోనే సరిపుచ్చమని, అయిదవకులము లేదని బాహాటముగా ఆదేశించినాడు. కంఠమెత్తి ఘోషించినాడు. కావున దీనినిబట్టి విమర్శనాత్మక దృష్టితో పరిశీలించినచో నీ పంచమజాతి యున్నదా? లేదనియే సమాధానించుకోవచ్చును.

వర్ణమనగా రంగని అర్థము. ఇచ్చట నాలుగు వర్ణములు నాలుగు రంగులకు జెందినవారని లింగాభట్టీయము, వజ్రసూచికోపనిషత్తు, శాంతిపర్వము లుద్ఘోషించు చున్నవి. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను తొందరగా పోల్చుకొనుటకు వీరల యొడలిరంగులు సాధనము లైనవి. పరికింపుడు.

వర్ణం, వర్ణ్యంతే కపిలారుణ పీత కృష్ణవర్ణైః
నిరూప్యంత యితి వర్ణాః - వర్ణ నుతౌ

- (లింగాభట్టీయము)

" బ్రాహ్మణో శ్వేతవర్ణః
క్షత్రియో రక్తవర్ణః
వైశ్యః పీత వర్ణః
శూద్రం కృష్ణ వర్ణః ఇతి నియమా భావాత్ "
తస్మాన్నదేహో బ్రాహ్మణ ఇతి

- (వజ్రసూచికోపనిషత్)

" బ్రాహ్మణాం సితో వర్ణః
క్షత్రియా ణాంచ లోహితః
వైశ్యానాం పీతకో వర్ణః
శూద్రానాం అసితస్తధాః "

- (శాంతి పర్వము)

పై ఉదహరింప బడిన ఆధారములు ప్రకారముగా సర్వ వర్ణములయందు ఈ రంగుల తేడాలు కొట్టవచ్చినట్లుండును, తొలినాటి మానవునకు దీనితో సంబంధమే లేదు. మానవజాతి పెరిగి సంఖ్య వృద్ధియగుచున్న కొలది స్వార్థపరులు తమ స్వీయ కుక్షింభరత్వమున కీ వర్ణాల గోల సృష్టించి దానిని దైవ శాసనముగా అంగీకరించి తీరవలెనని రాజుల చేత ముద్ర వేయించి తమ ఆధిక్యతకు భంగము వాటిల్లకుండ కాంస్య కుడ్యములను న్మించుకొన్నారని తేట తెల్లమగు చున్నది.

కావున వేదకాలమున ఈ అయిదవ వర్ణము గురించిన ప్రసక్తియే లేదు. అనార్యులు ఆర్యులని రెండు తెగలు మాత్రమే వేదకాలమున వర్ణింపబడినవి. అనార్యులకు దస్యులని మరొక పేరు గలదు. ఆర్యులకు వీరిపై ఈర్ష్య, దీర్ఘ

కోపము కలిగినవారై వీరిని సమూల నాశము గావింప కృత నిశ్చయులై నిరంతర యుద్ధాలు సాగించి చివరకు జయించి వారి ఆస్తిపాస్తులను హరించి తుదకు తమ కంటె ఎప్పుడైన ఆధిక్యతలోగాని మరెందునైనగాని అధికులగుదు రేమో యన్న భీతిచే వారిని మరీ దూరముగా తరిమివేసిరి. ఇంతకుముందు లిఖింపబడిన రీతిగనే అనార్యులు కొందరున్న చోటనే బాదబందిరుల సహించి నిలిచిపోగా మఱికొందరు బలహీనులై అరణ్యాసీమలలోనికిపారిపోయిరి. అట్టివారే ఆటవిక, కిరాత, శబర, పుళింద, మ్లేచ్ఛ, ఛండాలాది నామంబుల వారు. ఏనాటి కైనను ఆ అనార్యులు తమ్మును మించిపోవుదు రన్నబెంగతో అస్పృశ్యతాది మహా ఘోర శిక్షల కెర చేసి వారిని సంఘ బహిష్కృతులుగా నొనరించినారు. నాటికాలమున కిది విరుద్ధమే అయినను పెద్దల మాటలను ధిక్కరించరాదను భావమువలన ఎవరేమియు జేయజాలక మిన్న కుండిరి. ఆర్థిక, సాంఘిక, మత, నైతిక, రాజకీయముల పరిస్థితులు, నాగరకతా నాగరకతలు, భాషాభేదములు మార్పు జెందుచుండెడివి. క్రమముగా యుగధర్మములు మారిన కొలది యార్యజాతియందు వర్ణవిభాగ మవసరమయినదిగా కాన్పించును. మనువు తానొక ధర్మశాస్త్రమును నిబంధించి నాటి యార్య సమాజమునగల గుణ కర్మ విభాగములవలన జాతులను నేర్పరించినాడేమో?

కాలగమనము నాప గల శక్తిమంతుడీ వసుంధరామండలమున నెవడున్నాడు? సర్వ చరాచర జగత్తంతయు కాలగర్భము నుండి నిరంతరము మార్పు చెందుచునే ఉన్నది. కాలముతో పాటు ధర్మము మారలసి ఉన్నది. ఒకనాడు ధర్మముగా వ్యవహరింప బడిన చట్టము వేఱొక నాటికి అధర్మముగా గానిపించును. కాలమునకు మార్పునదియే దాని నిసర్గస్వభావము.

పూర్వాచారము లెన్ని మారినను నింక నీ పంచమ జాతికి విధించిన యస్పృశ్యతా శిక్షమాత్రము వైదొలగలేదు. పట్టణాలలో నాగరకతా ప్రభావమువలన కొంత కనుమరుగైనట్టులు కాన్పించుచున్నదేమో కాని పల్లెసీమ లందు మాత్రము నేటికిని అస్పృశ్యతా జాడ్య మాహాపైశాచికము వికటాట్టహాసము గావించుచు అమాయకులైన ప్రజలను తన యినుపకడియాలక్రింద నలుపుచుండుట ఆధునిక

హిందూ దేశ జనయిత్రి వీక్షించుచునే ఉన్నది. బుద్ధుడు, క్రీస్తు, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, కళ్యాణ బసవేశ్వరుడు, గాంధి, దయానందసరస్వతి, రామకృష్ణ పరమ హంస, వివేకానంద మొదలగు మహాపురుషుల ఉత్తమోత్తమమైన జీవిత సందేశాలు దిక్కులు ప్రతిధ్వనించుచున్నను నేటికిని యీ అంటరాని తనము హిందూ దేశమునుండి పూర్తిగ వైదొలగలేదని అనవచ్చును.

వెనుక విశ్వామిత్ర ఋషి యొక ఛండాలుని గృహమున కుక్క మాంసము భుజించినందులకు ప్రాయశ్చిత్తము నొంది విప్రుడగుటకు ధర్మసూత్రములు దొరికినవి గాని అస్పృశ్యతా దోష నివారణార్థ మెట్టి సూత్రములు నేటివరకు దొరకక పోవుట అభిలషణీయము గాదు.

నైఘంటికుల యభిప్రాయపథములో

ఛండాల = కోపగించుకొనువాడు

ప్లవ = క్రూరకర్మల నొనరించువాడు

మాతంగ = గ్రామమధ్యమును బొందనివాడు

దివాకీర్తి = పగలు యుచ్చారణ లేనివాడు

జనంగమః = జనులచే దొలగిపోవువాడు

నిషాద = పాపాత్ముడు

శ్వపచః = కుక్కను వండుకొనువాడు

అంతేవాసి = గ్రామముకడపట నుండువాడు

పుల్కస = పెద్దలను స్పర్శచే జెఱచువాడు

మాల-మల యను పర్వతవిశేషమున నివసించు తెగ మాతంగ - "మతంగాపత్యం మాతంగః'' మతంగ సంతతి యనిపురాణప్రసిద్ధము. ఈ యాది యాంధ్రులు ఆది ద్రావిడు లని వ్యవహరింపదగు నని కొందరు విజ్ఞుల అభిప్రాయము.

బ్రాహ్మణాది వర్ణ చతుష్టయము పరస్పర సాంకర్యము వలన అనులోమ ప్రతిలోమ జాతులు కలిగినట్లును అందు బ్రాహ్మణస్త్రీయందు క్షత్రియుని వలన సూతుడును, వైశ్యుని వలన వైదేహకుండును, శూద్రుని వలన సర్వధర్మ

బహిష్కృతుండగు ఛండాలుడును జనించినట్లు (యాజ్ఞవల్క్యస్మృతి 4 అధ్యాయము 93 శ్లోకము) వ్రాయబడియున్నది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య యీ మూడు వర్ణములు ద్వి జన్మలనియు, ద్వి జన్మత్వస్థితి లేని వర్ణము శూద్రులనియు నీ నాలుగు జాతులే కాని మరి ఐదవ జాతి లేదని వ్రాయబడినది. యాజ్ఞవల్క్య స్మృతి 10వ అధ్యాయము 400 శ్లోకములో ఛండాలురు ప్రతిలోమ జాతి యనియు వారే అస్పృశ్యులనియు వ్రాయబడియున్నది. నిజమున కిదే సరియైనదని భావింపవలసివచ్చినపుడు శంక జనించక పోదు. బ్రాహ్మణ స్త్రీయును, శూద్రుడును అస్పృశ్యులు కానప్పుడు ఈ యిద్దరకు సంభవించిన ప్రతిలోముడగు ఛండాలున కెట్లు అస్పృశ్యతా దోష మారోపించినారో అనూహ్యము. మున్ముందిట్టివి మరి యెక్కువ జరుగకుండ కాపాడు నిమిత్తము నీశిక్ష విధించినారని తలపవచ్చును.

**" బ్రాహ్మణ్జో స్య ముఖ మాసీత్, బాహూరాజన్యఃకృతః**
**ఊరూ తదస్య యద్వైశ్యః,, పద్భ్యాగ్ం శూద్రో అజాయత"**

**- (పురుషసూక్తము)**

భగవానుడు మానవునిరూపములో ప్రభవింప సృష్టిని నిర్మించుటలో బ్రాహ్మణులను ముఖము నుండి, క్షత్రియులను బాహువుల నుండి, వైశ్యులను తొడల నుండి శూద్రులను పాదములనుండి పుట్టించె ననుట పైశ్లోకమున కర్థము. అయితే విద్వాంసులైన వారలుమాత్రము పైశ్లోకమున కట్టి అర్థమును కట్టిపెట్టక ఈ క్రింది మోస్తరుగా అర్థము చెప్పినారు. విద్యను ముఖముతోను దేహబలమును భుజ బలము తోను ఓర్పును తొడల తోను సేవకు కాళ్ళతోను పోల్చినారు. పురుష సూక్త వాక్య ప్రకారము తైత్తిరీయ సంహితా బృహదారణ్యకోపనిషత్తులలో సంధింప బడిన నాల్గువర్ణముల వారిని (తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు) నేటి భారతీయులను విభజించినచో అంత్యజులలో తెలుపు వర్ణము గలవారు బ్రాహ్మణులగుదురు. గదా! ఇట్టి సమస్యలు విడ్డూరమునకు దారితీయ గలవు గదా!

సమస్త చరాచరములకు అధీశ్వరుండు, సర్వ సముడైన విశ్వేశ్వరుడే యీ

విశ్వంభ రావలయమును నిర్మించినాడనునది నిజము. ఆతనిని ఎఱుంగజాలెడి ఉత్తమ జ్ఞాన మును మానవునకే ఒసంగెను. జ్ఞాన సార విహీను లేమేమో సృష్టించుకొని లేనిపోని చట్టాలు బిగించి తమ స్వార్థము కోసము సమాజమునే ఆహుతి నొనరించిన ప్రబుద్ధుల భావాలు తొలగి పోవుచున్న కాలము సమీపించినది. ఇప్పుడిప్పుడే మానవ మహోదయ కాలమునకు నాందీ ప్రస్తావన జరిగినది. బాపూజీ నవచైతన్య విలసిత గీతాలు, దుర్వారభయంకర అస్పృశ్యతా జాడ్య మహా పై శాచికీ కరాళ క్రకచ దంష్ట్రలను పీకి వేయుచున్నవి.

**"సృష్టే పురా నామ రూప వివర్జితం జగత్"**

**- (బృహదారణ్యకోపనిషత్)**

సృష్ట్యారంభమున జగత్తునకు నామ రూపములు లేవు. తరువాత క్రమముగా యుగవిభాగము కృతాది యుగ ధర్మములు నిర్ధరింప బడినవి.

**" అంత్య జాతిః ద్వి జాతిశ్చ ఏక సహోదరాః**
**ఏక యోని ప్రసూతత్వాత్ ఏక శాఖేన జాయతే"**

మనుజు లందరు మను బ్రహ్మకు పుట్టినందున ఏకజాతి సహోదరులే అగు చున్నారు.

**" మనోర్జాతాః మనుజాః మనుష్యాః "**

సర్వ వర్ణములును మానవులే యగుటచేత సహోదరులే యగుచున్నారు. నేటి మానవసమాజ మెంతవరకు నీ సూత్రముల నంగీకరించి ఆచరణలో పెట్టుచున్నది. సముద్రములో ఒక నీటిబొట్టు.

**జల రాశి నీరమ్ము క్షణములో జుట్టిన**
**అల యగస్త్యుడు భాండమందుపుట్టె**
**సంయమీంద్రుడు యశ శ్శాలి గౌతమ ముని**
**చెవుల పిల్లికి వెస నవతరించె**

ఘనుడు రఘూద్వహున్ కావ్యమ్ము వ్రాసిన
వాల్మీకి పుట్టలో ప్రభవ మందె
అడుగు పెట్టిన చోట నిడుమలు రానీని
ఋష్యశృంగుడు లేడికే జనించె
ఒక్కడు జనించె దర్భకు నక్క కొకడు
పుట్టెననుచు పురాణాలు బోధ సేయు
వింతవింతలు నీ సృష్టి విధముజూడ
వల్లకీ పాణి వాగ్వధూ వల్లభుండ.

- అక్షరాభిషేకము.

పూర్వకాలమున ద్విజులు కానివారలనేకులు బ్రాహ్మణత్వమును బొందినవారు. పై పద్యములోనివారి జన్మవిధమెద్దియైనను వారందరును తమ తపోబల సంపదలవలన ద్విజత్వమును పొందినారనుటలో సందేహ మేమియులేదు. ఇచ్చట జాతితో నేమియు సంబంధము లేదు.

"జాతో వ్యాసస్తు కైవర్త్యాః శ్వపా క్యాస్తు పరాశరః"

- (భారతము)

"వ్యాస ముని చంద్రు గన్న పరాశరుండు
మాల దానికి బుట్టి బ్రహ్మర్షియయ్యె
వేశ్యకును బుట్టి మాలెత పెండ్లి యాడి
యా వసిష్ఠ మహర్షి బ్రహ్మర్షి యయ్యె"

- ( నిరుద్ధ భారతము)

వ్యాసముని చంద్రుని కనిన పరాశరుడు మాలెతకు జన్మించి బ్రహ్మర్షి అయ్యెను. భోగపుకాంతకు పుట్టి మాలెతను పెండ్లి ఆడిన వసిష్ఠమహర్షి బ్రహ్మర్షి అయ్యెను. వేదవ్యాసున కుద్భవించి దివ్యజ్ఞాన సంపన్నుడైన శుక మహర్షి ధన్యు

డయ్యెను. ఈ చర్చ శాంతిపర్వము, దేవీభాగవతము ప్రథమస్కంధమున గన్పట్టును.

మనువు కూడా తపస్సంపన్నత్వము వలన పూర్వము ద్విజలయినారని వచించినాడు.

విశ్వామిత్రుడు క్షత్రియ వంశసంభూతుడు. ఈతడనేక బ్రాహ్మణ గోత్రములకు మూలపురుషుడు. అనేక వేదమంత్రములకు బ్రాహ్మణులకు ముఖ్యముగా గాయత్రికి కర్త.(అనుశాసనిక పర్వము)

జాబాలుని కొడుకు సత్యకాముడు తన సత్యసద్గుణాల వలన గౌతముడు బ్రాహ్మణజాతిలో చేర్చగా దాని కెల్లభూసురులు తమసమ్మతిని దెలిపినారు.

**"అస్తు వేదవిశ్వాస రహితో ధర్మపరాఙ్ముఖం తన్ననుష్ఠతి సజన్మనా బ్రాహ్మణోపి కర్మ చండాలో భవత్."**

**- *(విద్యారణ్యులు)***

| | |
|---|---|
| ఋష్యశృంగుడు | లేడికి |
| కౌశికుడు | దర్భకు |
| జాంబూకుడు | నక్కకు |
| వాల్మీకి | పుట్టకు |
| వసిష్ఠుడు | ఊర్వశికి |
| అగస్త్యుడు | కుండకు |
| గౌతముడు | చెవులపిల్లికి |
| మండూకముని | కప్పకు |
| శుకమహాముని | చిలుకకు |

తపస్సిద్ధి వలన వీరందరు బ్రాహ్మణత్వము నొందినారు. నిజమును పరిశీలించితి మేని జాతివలన వీరందఱు బ్రాహ్మణులు కానేరరు.

"అక్షమాలా (అరుంధతి) వసిష్ఠేన సంయుక్తా ధయయోనిజా,
సారంగీ మంద పాలేన జగామా భ్యర్హణీయతామ్"

- (మనుస్మృతి)

"ముని చంద్రుండగునవ్వసిష్ఠు సతియై ముల్లోకముకల్ మెచ్చు
రీతిని వర్తించి లసద్గుణాఢ్యయయి పాతివ్రత్య మాహాత్మ్యమున్
దనరారన్ వరతారయై పొలిచి మింటన్ దంపతీలోక వం
దనముల్ గాంచు నరుంధతీసతియు జండాలాంగనారత్నమే."

- (నిరుద్ధభారతము)

మునిలోక చంద్రుడయిన వసిష్ఠుని అర్ధాంగలక్ష్మి మాతంగకులానకు చెందిన దని దీని తాత్పర్యము.

పరిశోధించినకొలది యిటులే బ్రాహ్మణులు కానివారనేకులు బ్రాహ్మణులుగా మారుటయు జరిగినకాలమున్నది.

"అబ్రహణ్యే తదా దదేశే కైవర్తాన్ ప్రేక్ష్య భార్గవః
.................యజ్ఞసూత్ర మకల్పయత్,
స్థాపయిత్వా స్వకీయే సక్షేత్రే విప్రాన్ ప్రకల్పితాన్,
జామదగ్న్య స్తదోవాచ సుప్రీతే నాంతరాత్మనా."

- (స్కాందపురాణము-సహ్యాద్రిఖండము)

బ్రాహ్మణ శ్రేష్ఠుడైన భార్గవుడు తొల్లి
ద్విజులు లేని యొకానొక దేశమందు
సర్వసము డౌచు గైవర్త జాతి జనుల
జందెములు వైచి విప్రుల జలుపలేదే?

- (నిరుద్ధభారతము)

భార్గవరాము డొక అవతారమూర్తి. విప్రులులేని దేశములో బెస్తవారికి జందెములు వేసి బ్రాహ్మణులుగా జేసినాడు. ఈ తీరున పరిశీలించుకపోయినచో నాటి కాలమున మహానుభావులందరు తపోమహిమవలన సంస్కారము పొంది బ్రహ్మత్వము నందినారని విశద మగుచున్నది. జన్మలో బ్రాహ్మణుడు కాకపోయినను గుణకర్మాదులచే బ్రాహ్మణుడగుట నాటికాలపద్ధతి.

## బ్రాహ్మణో . . .

బ్రాహ్మణుడు తెల్లనివాడు. క్షత్రియు డెఱ్ఱనివాడు. వైశ్యుడు పచ్చనివాడు. శూద్రుడు నల్లనివాడు అను నియమము లేకపోవుట వలన దేహమును బట్టి బ్రాహ్మణత్వము రాలేదని, పైవాక్యమున కర్థము ఈ ఉపనిషత్ బ్రాహ్మణత్వము పుట్టుక చేత సహితము రాలేదని యీ క్రింది వాక్యములతో జెప్పుచున్నది.

**"తర్హిజీతి ర్బ్రాహ్మణ ఇతిచేత్, తత్ర జాత్యంతరే**
**ష్వనేక జాతి సంభవాత్ మహర్షయో బహ వస్పంతి ....**
**వ్యాస: కైవర్త కన్యాయాం . . . వసిష్ఠ ఊర్వశ్య . . . అగస్త్య:**
**కలశే జాత ఇతి శ్రుతత్వాత్"**

వ్యాసుడు బెస్తదాని యందును, వసిష్ఠుడు ఊర్వశియందును, అగస్త్యుడు కుండ యందును పుట్టినట్టు వినవచ్చుచుండుట వలన ఒక్కజాతిలోనే అనేక జాతి సంభవులైన మహర్షులనేకులుండుటను బట్టి జాతి వలననే బ్రాహ్మణత్వము కలుగదని దీని తాత్పర్యము. ఈ ప్రకారముగానే అనేక పురాణములలో వారు వారు చేయు కర్మల వలననే కాని జాతి మాత్రముచేత బ్రాహ్మణత్వము రాదని చెప్పబడి యున్నది.

కృతయుగములో వర్ణ భేదములేదు. పూర్వకాలమునందు ఉత్తమవర్ణత సద్గుణముల వలననే వచ్చుచుండినదనట్లును, మంచినడత లేనివాడు, బ్రాహ్మణునికి బుట్టినను శూద్రు డగుచుండినట్లును, మంచినడతగలవాడు శూద్రునికి బుట్టినను బ్రాహ్మణుడగు చుండినట్లును స్పష్టముగా తెలియ వచ్చుచున్నది.

మంచి పనులు చేయుట చేత శూద్రుడు బ్రాహ్మణత్వము పొందును. వైశ్యుడు క్షత్రియత్వమును పొందును . . . . పుట్టుక, సంస్కారము (ఉపనయనాదులు) వేదాధ్యయనము సంతతి, ద్విజత్వమునకు కారణములు గావు. మంచి నడత యొక్కటియే కారణము. లోకములో బ్రాహ్మణత్వమంతయు సద్వృత్తి చేతనే కలుగును. సద్వృత్తి యందున్న శూద్రుడును బ్రాహ్మణత్వము పొందును.

*(వర్ణము . . . కందుకూరివీరేశలింగం పంతులు)*

పైని నిరూపింప బడిన నిర్ణయములగురించి శ్రీభవిష్య మహాపురాణము బ్రహ్మపర్వము 42 అధ్యాయములోని యీ దిగువ శ్లోకములను తిలకింపుడు:

**"ఆచార మనుతిష్ఠంతో వ్యాసాది ముని సత్తమాః**
**గర్భా దానాది సంస్కార కలాప రహితః స్ఫుటమ్"**

సదాచారము ననుష్ఠించు వ్యాస మహాముని ప్రభృతి వర్గము గర్భదానాది సంస్కార విహీనులే కదా!

**"జాతో వ్యాసస్తు వర్త్యాః శ్వపాకాశ్చ పరాశరః**
**శుక్యాః శుకః, కణాదా ఖ్యస్తథో లూక్యాః సుతో భవత్"**

మహామహుడైన వ్యాస మునీంద్రుడు కైవర్తికి పుట్టెను. పరాశరుడు కుక్క మాంసమును వండువానికి ఉద్భవించెను. శుకయోగి చిలుకకు పుట్టెను. కణాదముని గుడ్లగూబకు కొడుకయ్యెను.

**"మృగీ బోధర్ష శృంగోపి వసిష్ఠో గణికాత్మ జయః**
**మంద పాలో ముని శ్రేష్ఠో నావికా పత్య ముచ్యతే"**

ఋష్యశృంగుడు మృగీగర్భమున జనించెను. వసిష్ఠుడు వేశ్యాపుత్రుడయ్యెను. మందపాలుడను మునిశ్రేష్ఠుడు పడవ నడుపుదాని సుతుడయ్యెను.

**"మాండవ్యో మునిరాజస్తు మండూకే గర్భసంభవః**
**బహవోన్యేఽపి విప్రత్వం ప్రాప్తయే పూర్వద్విజాః."**

"హరిణీ గర్భసంభూత ఋష్యశృంగో మహాముని:
తపసా బ్రాహ్మణోజాత: సంస్కారస్తేవ కారణమ్"
"శ్వపాకీ గర్భ సంభూత: పీతా వ్యాసస్యపార్థివ:
తపసా బ్రాహ్మణో జాత: సంస్కారస్తేవ కారణమ్."
"ఉలూకీ గర్భ సంభూత: కణాదాఖ్యో మహాముని:
తపసా బ్రాహ్మణో జాత: సంస్కారస్తేన కారణమ్."
"గణికా గర్భసంభూతో వసిష్ఠశ్చ మహాముని:
తపసా బ్రాహ్మణో జాత: సంస్కార స్తేవ కారణమ్."

ఈ వివరణసంగ్రహము గమనించినచో పతితృలోకము సరిగా అర్థము చేసికొనగలదని తలంపవచ్చును.

అంటరానివారీ హిందూదేశమున పదికోట్ల మించి జనాభా కలిగి యున్నారు. వీరిని పంచమజాతి వారిగనే పరిగణించినారు. ఆలోచించిన యథార్థమునకు ఈ పంచమ జాతివారే ప్రాచీన భారతదేశమునకు ప్రభువులై, రాజులై, ఋషి చంద్రులై, వేదాంత వేద్యులై యున్నట్లు మన దేశచారిత్రక గ్రంథములు ఋజువు చేయుచున్నవి.

ఆర్యుల దండయాత్రలకు ముందు ఈ భారతదేశములో అనార్యులయిన వారు ఈ పంచమ జాతి వారే కదా! వ్యాసుడు, వాల్మీకి యిత్యాది మహామునులు, కవులు అనార్య జాతికి చెందినవారేకదా! ఒకానొక నాటిసమయములో మహోజ్జ్వలముగా వెలుగొందిన పంచమజాతి యీనాడు అథోజగత్తులో అల్లలాడిపోవు చున్నది. కాల వైపరీత్యము మరల మరల ఆజాతి తనకాళ్ళమీద నిలిచి తొలినాటి జీవనోపాధుల సమకూర్చుకొని ఆత్మ విశ్వాసముతో పయనము సాగించుచున్నది. అగునుగాక!

చరిత్రముల నూతగాగొని సహృదయభావముతో సమీక్షించిన యెడల ఈ యాది మాంధ్ర జాతి యెంత దిగజారి పోయినదో కులముల పేరుతో ఎంతనికృష్ట

స్థితికి పాల్పడినారో ఆలోచించినకొలది గుండెలు కరుగక మానవు. వెలివాడలలో జీవింప దలపెట్టి ఆత్మాభిమానము కాపాడుకోదలచినవారు అన్నివిధాలైన సౌకర్యాలకు దూరమై ఆర్యులు హేయ భావములో దీర్ఘ క్రోధములతో వారిని ఎట్టుల బాధించినారో తెలియ గలము. నిప్పు నివ్వక, నీర మివ్వక, భోజనసామగ్రికి దూరుల జేయుటబట్టి క్షుధానలదగ్ధమూర్తులయిన ఆది మాంధ్రజాతి ఆకలిమంటలకు ఓర్వలేక ఎన్నెన్ని యగచాట్లు బడినదో చరిత్రలు చాటుచున్నవి. వీరు వెట్టిపని చేయవలెను. వీరి కెన్నియో హైన్యాతిహైన్యమైన నీచాతినీచమైన పేర్లను తగిలించి వారి యసూయా మాత్సర్యములను వెలికి గ్రక్కినారు. మనువు తన మనుస్మృతి దశమాధ్యాయమునం దెట్లు వాపోవుచున్నాడో పరికింపుడు.

**"అబాంధవం శవం చైవ నిర్హారే యురితిస్థితిః"**

చండాలురు లేక శ్వపాకులయిన యీ పంచమజాతివారు బంధువులు లేక చనిపోయినవారి యనాథ ప్రేతమునెత్తవలయునట. ఇది వారల ధర్మమట.

**దిక్కు మొక్కు లేని దీనులశవములు**
**శ్వపచకులులె మోయవలయుననుచు**
**సర్వధర్మశాస్త్రచయ మేకముఖమై వి**
**ధింప దొక్కొ? బుధులు తెలియరొక్క?**

*- (నిరుద్ధభారతము)*

ఆనాటినుండి నేటి దనుక నీ మాలలుమాదిగలు (హరిజనులు) పైవర్గములవారి తాకిడికి, అలజడికి లోనయియెన్నో భ్రష్టబిరుదావళులతో నెంత జుగుప్సాకరమైన జీవితము గావించినారో తలచినచో గుండియలు జలదరింపకమానవు. విజ్ఞానుల కాలవాలమయిన పంచమజాతి కీ దుర్గతి పట్టినది. హరిజనులీ తెరగున వింగడింపబడి నారని శాస్త్రరీత్యా చెప్పికొనవచ్చును.

ఈ వర్ణ వ్యవస్థను ఈ అంటరానితనమును నిర్మూలించుట కెందరో మహాను భావులు నిరంతము శ్రమించి మూఢాచార పరాయణుల నెదిరించి

యెన్నియో సంస్కరణలు జేయసాహసించినారు. ఒక ప్రక్క సంస్కారులు సామాజిక వ్యవస్థలో మార్పు తీసికొని రావలయునని తలంచగా వేరొక వంక శ్రుతులు, స్మృతులు, పురాణాలు, ఎదురునిలిచి పోరాటాలు సాగించెడివి. ఈ సంఘర్షణలో అంతిమజాతి మహా భ్యున్నత శతాంగము ఒక యడుగు ముందునకు వైచుట కవకాశము లేకపోయెడిది. శ్రీమద్రామానుజాచార్యులు, శంకరాచార్యులు, కబీరు మున్నగు ప్రముఖ సంస్కారులు మహోదారులీ హరిజన వర్ణ వివక్షత తొలగింప కొంతమార్పు గావించినను పిదపవారి ఉద్యమశక్తి సన్నగిల్లినది. తరువాత బాపూజీ, అంబేద్కరుల కృషివలన జాగృతి, ప్రగతి ఈజాతికి కలిగినది.

వర్ణబాహ్యులైన అత్యంజుల కెందరకో రక్షకుడై రామానుజాచార్యులు తిరుమంత్ర ముపదేశించి వైష్ణవసంప్రదాయావలంబకులుగా చేసినాడు. శ్రీమచ్ఛంకర భగవత్పాదుల వారికి జ్ఞానోపదేశ మొసగినవాడు చండాలుడేగదా!

**"పంచములు మ్లేచ్ఛులును విష్ణుభక్తి మెఱసి**
**వైష్ణవులు పూజసేయ నాళ్వారులైరి**
**మంగయాళ్వారుడొక మ్లేచ్ఛపుంగవుండు**
**మరి తిరుప్పాణియాళ్వారు మాలవాడు"**

***- (నిరుద్ధ భారతము)***

**"వైష్ణవం వైష్ణవో దృష్ట్వా ప్రణమేద్దంవద్భువి"**

వైష్ణవమత ప్రవిష్టుడగు యంత్యాజాతి వాదురైన వైష్ణవోత్తముడు సాష్టాంగ వందనములు ఆచరింపవలయునట, ఇచట కులముతో నిమిత్తమేలేదు.

**"యఃపశ్యతి శుభాచారం వైష్ణవం వీతకల్మషమ్**
**యస్మిన్ కస్మిన్ కులే జాతం ప్రణమేద్దంవద్భువి"**

సదాచార పరుడును, దోషరహితుడునగు వైష్ణవుని జూచిన ఎడల కులముతో నిమిత్తములేకయో వైష్ణవుడతనికి నేలమీదపడి సాష్టాంగ నమస్కృతులాచరింప వలయును, అంటరానివారిగా దూరముగా నూరిలోనికి రానీయక కఠిన శాసనాలు

విధించిన విజ్ఞానవర్గము తమకేదైన లాభము కల్గుచో హరిజనుడు తాకినను ఫరవాలేదు. వాడు పెట్టినకూడు గుడిచినను తొందరలేదట. ఇది కులాల నిర్మించి మహాగాధముల సృజించి చనిన మనువు తన మనుస్మృతి దశమాధ్యాయము నందు వ్రాసికొన్నాడు.

**"జీవితాత్యయ మాపన్నో మోన్న మతి మత స్తతః**
**ఆకాశ మివ పంకేన నస పాపేన లిప్యతే"**

బ్రాహ్మణుడు చచ్చిపోవునంతటి ఆపత్కాలమందు ప్రతిలోమజాతివాడు మొదలైనవారల ఎవనిఅన్నమును భుజించినను బురదయందలి ఆకాశమువలె వానిలో గొంచెమేనియు పాపమంటదు. వామదేవ విశ్వామిత్రమహర్షులు దీని కుదాహరణములు. మను వెంతటికైనను తగినవాడుగా కన్పించుచున్నాడు.

మఱియు ఈ క్రిందిమంత్రము నవలోకింపుడు.

**"దైవాధీనం జగత్సర్వం**
**మన్త్రాధీనంతు దైవతమ్**
**తన్మంత్రం బ్రాహ్మణాధీనం**
**బ్రాహ్మణో మమ దేవతా"**

ఇందులోని నిజానిజాలను సత్యసంధులయిన పాఠకలోకము గుర్తించుగాక!.

ఈ వర్ణములను వర్ణవ్యత్యాసములను భగవానుడే సృష్టించినాడని ప్రబోధించు మూర్ఖస్వాముల అనాలోచనమే హిందూ దేశ మహోన్నతాధ్యాత్మిక శక్తి విహీన మగుటకు, టచ్యుత మగుటకు ప్రబల తార్కాణాలు. విజ్ఞాన వికాసము లొకని సొత్తు గాదు. ఇది అందరిదికూడ. ఒకే ఒక వర్గము యొక్క సొమ్ముగాదు. అలాగని నిర్ధరించినచో ఆనాటి హైందవసమాజములోనే మహాత్ములయినవారలు కోకొల్లలుగా హరిజనవర్ణములో (పంచమ) జన్మించుట ప్రపంచ ప్రఖ్యాతి బడయుటను గూర్చి యేమనవచ్చును?

సర్వశాస్త్ర కళాభిజ్ఞులు, వేదాంత దేశికులు, పరమర్షులు, కావ్య పురాణేతి

హాస నిర్మాతలు, దైవజ్ఞులు, మహా వదాన్యులు, రాజ్య రథ సారథులు, సాధ్వీమ తల్లులు వేయేల! అపరభగవానులు పంచమజాతిలో జనించినారు. ఈమాటలు శాస్త్రములకు కడుసమీపములు. శాస్త్రసంబంధములు కాదనుటకు వీలులేనివి. ఒక్కొక్కరి గురించి చెప్పినచో గ్రంథవిస్తర మగునని తలంచి విడిచిపుచ్చవలసి వచ్చినది.

రామానుజుడు, దయానందుడు, నానక్, వివేకానందుడు, చైతన్యుడు, ఏకనాథుడు - వీరు ఆదిమాంధ్రుల హృదంతరాళములలో ధ్వనింపగల మహా పురుషులు. ఆదిమాంధ్రులు అస్పృశ్యతా జాడ్య నివారణకోసము నిరంతరము శ్రమపడిన ఉదారతా గుణ సింధువులు.

క వ్యగ్రణి ఆదికవి వాల్మీకి, మున్యగ్రణి పరాశరుడు, ధర్మ సంవేది వేదవ్యాసుడు, ఆధ్యాత్మవేత్త శుకుడు, లోహిదాసుడు గౌరవభాజనులు కాలేదా?

సామ్రాజ్యాధిపతి హరిశ్చంద్రుని బంటుగా గొన్న వీరబాహు డెవరు?

గాధిరాజు కుమారుని గారవమున గాంచిన అభిమానపుత్రిక లెవరు?

ఇన్ని ఎందులకు?

మతంగమహాముని, తిరుప్పాణి యాళ్వారు, కవి కుల భూషణుడు, కనకవిబుధుడు ఏజాత్యుద్భవులు? అరివీర భయంకరుడు వీరాధివీరుడగు కన్నమనీడు, శ్రీహర్షుని యాస్థానకవి దివాకరుడు ఎవరు?

**"అహో ప్రభావో వాగ్దేవ్యాః మన్మాతంగ దివాకరః**
**శ్రీహర్ష స్యాభవత్ సభ్యఃసమో బాణ మయో రయోః"**
**చారు తర కీర్తి శ్రీహర్ష చక్రవర్తి**
**సభను బాణ మయూరాది సత్కవీంద్ర**
**తుల్య సత్కార గౌరవాదులను గాంచి**
**తనరెడు దివాకరుండు మాతంగజుండు.**

**- (నిరుద్ధభారతము.**

యామునార్యుని యంతేవాసి మార సూరనాంబి ఏ కులమునకు చెందినవాడు?

**యామునార్య్య శిష్యుడై పరిపూర్ణ దే**
**శిక వరేణ్య్య వలన సేవ గాంచి**
**పెరియ నంబిచేత జరమ క్రియలు గొన్న**
**మార సూరి నంబి మాలగాడె?**

***- (నిరుద్ధభారతము)***

సతి లోకనుత వసిష్ఠ మహాముని సతీ రత్నము అరుంధతి నేటికి నూతన వధూ వరుల వివాహ వేళలో మ్రొక్కులను స్వీరించుచున్నది. దొడ్డమహారాజుబిడ్డ మాయావతి ఈ యింటి కోడలుగా మలగినది. హరిశ్చంద్ర సార్వభౌముడు యీయింటి వీరబాహునిబంటుగా సేవజేసినాడు. పరమపూజ్యురాలయిన గొంతెమ్మ(కుంతి) ఈజాతికి యిలువేల్పుగా నిలిచిపోయినది.

ఇవియునుగాక శ్యామలాస్తోత్రము, బృహత్స్తోత్రరత్నాకరము, శ్యామలా నవరత్నమాలాస్తోత్రాది ప్రమాణములందు మాతంగకన్యక యైన అరుంధతీ స్తవమును గమనించినచో నీజాతి మేటిగొప్పదనము చెప్పకయే చెప్పుచున్నది.

**"మాణిక్యవీణా ముపలాలయంతీం**
**మదాలసాం మంజుల వాగ్విలాసాం**

**మాహేంద్రనీలద్యుతి కోమలాంగీ**
**మాతంగ కన్యాం మనసా స్మరామి"**

**"మాతా మరకతశ్యామా మాతంగీ మధుశాలినీ**
**కుర్యా త్కటాక్షం కల్యాణీ కదంబ వనవాసినీ"**

"జయ! మాతంగ తనయే! జయ! నీలోత్పలద్యుతే!
జయ! సంగీతరసికే! జయ! లీలాశుకప్రియే!"

- (కాళిదాసు)

" . . . . . మతంగ ముని కన్యకాం మధుర భాషిణీ మాశ్రయే"

(శంకరాచార్యకృత త్రిపురసుందరీ స్తోత్రము)

"జయ! మాత ర్విశాలాక్షి! జయ! సంగీతమాతృకే!
జయ! మాతంగి! చండాలి! గృహీత మధుపాత్రకే! "

ఎల్ల హిందువులును నుపాసించు దేవ
గణములోపల మాతంగ కన్య లేదె?
అల్ల మాతంగ వంశజు లెల్లవారు
హిందువుల దైవముల నుపాసింత్రు గాదె!

- (నిరుద్ధభారతము)

ఆత్మ వంచనకు లోనుగాక సాహస మూర్తులై ప్రతిపక్షులతో పోరాడి అపజయము పొందినను నరే ఆత్మాభిమానమును వీడని ఆదిమాంధ్రుల పూర్వపు టౌన్నత్య మెంత సుసంపన్నమై, సువిజ్ఞాన సంకలితమై, సువిశాలమై విరాజిల్లినదో దీని బట్టి ఊహించుకోవచ్చును. నంద చరిత్రము పరికించిన అందు నందుడు మహా క్లిష్టముల ననుభవించినప్పటికి అత్యంత భక్తి తత్పరతచే సర్వ జనానందుడు కాగలిగినాడు. లోహిదాసుడు చర్మపాత్రములందే యర్చనము జేసి విష్ణుసందర్శన మాచరింపగలిగినాడు.

నేటికిని శ్రీపెరుంబుదూరు నందు రామానుజాచార్యులవారి అరదంబును మాలవారే నడుపుచున్నారు. మైసూరులోని మేలు కోటను విష్ణు దేవాలయమును సంక్రాంతి మూడునాళ్లు స్వామివారి సేవ పంచములే చేయుట జగద్విదితము. మహారాష్ట్రమునందు పండరిపురములో స్వామి స్యందనము గోసంగిజనుల

నడుపుచుండుట తేటతెల్లమయిన వ్యవహారము. ముఖ్యముగా మేలుకోట వైష్ణవ దేవాలయమున మాలవాండ్రే దేవుని కర్చకులుగా నుండి బ్రాహ్మణులకు సహితము శఠగోపమును ప్రసాదము నిత్తురు. కావున పుట్టుకచేత నెవ్వడును బ్రాహ్మణుడు కానేరడని శాస్త్రాలు సవాలుచేసి వ్యాఘోషించుచున్నవి.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాల్గువర్ణాలనియు, అందు బ్రాహ్మణుడు ప్రధాను డనియు స్మృతులు చెప్పుచున్నవి. అయితే ఇక్కడొక్క సందేహము కలిగి ప్రశ్న ఉద్భవించును. ఎవడు బ్రాహ్మణుడని?

జీవము, దేహము, జాతి, జ్ఞానము, కర్మము, ధర్మము మొదలైనవానిలో నేది బ్రాహ్మణుడగుటకు ప్రధానకారణమని ప్రశ్నవేసికొని యోజించుకొన్నచో నందు జీవమువలననే బ్రాహ్మణుడగు నన్నయెడల, గడిచినట్టియు, గడువనున్నట్టియు అనేక దేహములందు జీవు డొక్క రూపమే యగుటచేతను జీవమువలననే బ్రాహ్మణుడు కానేరడని స్థిరీకరింపవచ్చును. సరే, యటుల గాక దేహమువలననే బ్రాహ్మణుడగునని తలంతుమా అంత్యజులు మొదలు అగ్రజులవరకు వారి కెల్లరకు పాంచభౌతికమై దేహ మొక్కవిధముగ నగుటచేతను చావు, పుట్టుక మొదలగు ధర్మము లొక్క రూపమే యగుట చేతను బ్రాహ్మణులు తెల్లగను, క్షత్రియులు ఎఱ్ఱగను, వైశ్యులు పచ్చగను, శూద్రులు నల్లగ నుండవలెనన్న శాసనము లేకపోవుటచేతను, దేహమువలన బ్రాహ్మణుడు కానేరడని స్పష్టముగా గోచరించుచున్నది.

మరియును జ్ఞానముచేతనే బ్రాహ్మణు డగుచున్నాడనుటయును పొసగదు. పరమార్థజ్ఞానము గలవారు తదితరవర్ణముల వారియందును కలుగుటచేత జ్ఞానమువలననే బ్రాహ్మణు డగుచున్నాడనునదియు పొసగదు. అఖిలజీవులకు సంభవించు సంచితము, ప్రారబ్ధము, ఆగామి అను కర్మలన్నిటి యొక్క అనుభవమెల్లరకు నొక్క విధముననే యుండుటచేతను పూర్వకర్మ ప్రేరణమువలననే ఇప్పటికర్మ అన్నియు సర్వజనులును చేయుదు రనుటచేత కర్మ సిద్ధాంతమువలన బ్రాహ్మణుడగుట పొసగదు. చివరకు ధర్మమువలన తానా కులమున కర్హుడని తలచినచో క్షత్రియ, వైశ్య, శూద్రాదులందరు,

గాంగేయాదిదానాదికముల నొనర్చు వదాన్యు లుండి యుండుట చేత ఇటులను బ్రాహ్మణుడు కానేరడని నిరూపించవచ్చును. అయినచో ఎవడు బ్రాహ్మణుడను ప్రశ్న యటులే యుండిపోవలసి వచ్చినది.

జాతిగుణక్రియా రహితుండు,ఆత్మస్వరూపమును తెలిసిన వాడు, కామ వాంఛాది దోష రహితుండును, శమాది గుణ సంపన్నుడు, ఆశా మోహా మిషణామాత్రము లేని వాడు, దురహంకారము లేనివాడు మాత్రమే బ్రాహ్మణుడగు నని శ్రుతి, స్మృతి పురాణాదికముల యొక్క అభిప్రాయమై యున్నది. మత్స్య పురాణమును పరికించినచో నందొక చోట-

**"యథా కృత యుగే పూర్వ మేక వర్ణ మభూత్కిల**
**తథా కలియుగస్యాంతే శూద్రీ భూతాః ప్రజాస్తథా"**

కృతయుగ మందు పూర్వ మెట్లు జగత్తేక వర్ణము కలిగియుండెనో అట్లే కలి యుగాంతమున ప్రజలెల్లరు నొకేవర్ణముగా నుందురు.

భారతములోని శాంతిపర్వమునందు-

**"న విశేషో స్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్**
**బ్రాహ్మణాపూర్వసృష్టం హి కర్మభి ర్వర్ణ తాం గతః"**

వర్ణములలో విశేషమేమియు లేదు. ఈప్రపంచ మంతయు పూర్వకాలమందు బ్రహ్మమయముగానే సృష్టింపబడి కర్మచేత వర్ణత్వమును బొందినది.

ఆపస్తంబులవారు తమ ధర్మసూత్రములందు-

**"అధర్మచర్యయా పూర్వోవర్ణో జఘన్య జఘన్యవర్ణ**
**మాపద్యతే జాతిపరివృత్తౌ ధర్మచర్యయా జఘన్యో**
**వర్ణః పూర్వ పూర్వవర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ"**

అధర్మచర్యచేత ఉత్తమకులమువారు జాతిపరివృత్త మందు క్రమముగా తక్కువవర్ణమును పొందుదురు. ధర్మచర్యవలన హీనవర్ణము వాడు జాతి పరివృత్తమందు హెచ్చువర్ణమును పొందునని అన్నారు.

మనువు తన మనుధర్మశాస్త్రమునందిట్లు శాసించినాడు. తిలకింపుడు:

**"శూద్రో బ్రాహ్మణతామేతి**
**బ్రాహ్మణశ్చేతి శూద్రతాం**
**క్షత్రియాజ్ఞాత మేవంతు విద్యాద్వైశ్యత్తథైవచ"**

శూద్రుడు బ్రాహ్మణత్వమును పొందును. బ్రాహ్మణుడు శూద్రత్వమును పొందును. ఇట్లే క్షత్రియుడును వైశ్యుడును వర్ణాంతములు పొందుదురు. కనుక ఈ చాతుర్వర్ణ్యములు స్థిరములుగాక గుణకర్మాదికములచే తారుమారగు చుండినట్లు తెలిసికోగలము.

వేదహితజ్ఞానమును తెలిసికోలేని ద్విజులు, జ్ఞానవిజ్ఞానములు నశించి, స్వేచ్ఛావిహారవిహారంబు గలిగి, పిశాచరాక్షస ప్రేతలుగాను, పలువిధములయిన మ్లేచ్ఛ వర్ణులు గాను, అయిరని శాంతిపర్వములోని 18వ అధ్యాయమున చూడగలము.

**"బ్రహ్మ చైత త్పురా సృష్టం ఏతుజానంత నద్విజాం**
**తేతాం బహు వివాస్త్యన్యా స్తత్రతత్ర ద్విజాతయః**
**పిశాచా రాక్షసాఃప్రేతా వివిధా మ్లేచ్ఛా జాతయః**
**ప్రణష్ట జ్ఞాన విజ్ఞానాః స్వచ్ఛందా హార చేష్టితాః"**

అనులోమ ప్రతిలోమ జాతులలో అభివర్ణింపబడిన చండాలు రనబడువారు పూర్వమెప్పుడో మరల స్మృతిబోధితమైన విధానమున అగ్రవర్ణములలో కలిసిపోయియుందు రని తలంచుట కవకాశములున్నవి.

మనము నిష్పక్షపాతబుద్ధితో శ్రుతి,స్మృతి, పురాణముల నవలోకించినచో దేశ కాలపాత్రతలబట్టి సాంఘికాచారములను సమయోచితముగా నాటి సాంఘిక శాసన ప్రమాణకర్తలు మార్చియుందురన్న సత్యము పూర్వగ్రంథములన్నియు ఘోషించు చుండగా, తాబట్టిన కుందేటికి మూడేకాళ్ళని, కూపకూర్మాలవలె జాత్యభ్యున్నతికి, నిరోధకులై, ప్రవర్తిట్లుట కేవలమ జ్ఞానజనితమైన మహాపాప

కృత్యమని చెప్పక తప్పదు. ఇవియన్నియు అమాయకులకు తెలియని సంస్కృతములోనే దాచి యుంచికొని ప్రజలను మోసగించి భయపెట్టి మౌఢ్యప్రేరితమైన ద్వేషానల జ్వాలలకు ఆజ్యము పోసినారు. ఇక నయినను అన్యాయముగా ఇంతకాలమునుండి యంటరానివారుగా జూడబడుచున్న హరిజనులు అస్పృశ్యులు కారని శాస్త్రాధారములబట్టి వీరు స్పృశ్యులే యనిర్ధారింపబడినది.

"చండదేవుని వాక్ప్రచండధాటికి సురేం
ద్రుడు కడు విస్మయం పడిననాడు
సతి లోకనుత యరుంధతిని సురలు మెచ్చ
నలవసిష్ఠుడు పెండ్లియాడునాడు
ఘన దివాకర మహాకవి లోకచంద్రుండు
శ్రీహర్షు సభను భాసిల్లునాడు
తిరువళ్ళువరు పాండ్యదేశాధిపతి కొల్వు
కూటాన మెప్పులన్ గొన్ననాడు
ఆదియాంధ్రు డెంత యౌన్నత్య పదవిలో
దనిసె ననుట కిది యుదాహరణము."

*- (అక్షరాభిషేకము)*

ఈ వర్ణ భేదములు నైసర్గికముగాగాక వ్యవహార మగుటచే నడుమ నెప్పుడో వచ్చియుండును. ఆర్యులు తొలుత పంజాబుప్రాంతములో కాలూనిరి.

ఆర్యులు అనార్యులను దస్యులని పిలిచెడివారు. దస్యులనగా దొంగలని, శత్రువులని అర్థము. ఋగ్వేదమునందు మహర్షులైన వారు దస్యులను సర్వసమూలముగా నాశన మొనరింప తమ యిష్టదైవములగు ఇంద్రాది దేవతలను వేడుకొనిన ఋక్కు లెన్ని యోకలవు. ఈ అనార్యులనే మరీనీచముగా వాడబడేశబ్దములతో పిశాచులని, రాక్షసులని పిలిచెడివారు.

వెనుక ఉదహరించినతీరుగనే వర్ణమనగా రంగని యర్థము.

ఆర్యులు తెల్లనివర్ణము. ఈ ఆర్యులు నల్లనివర్ణము. ఆ యుగము నందుండిన వర్ణ భేద మంతయు నింతే ననవచ్చును. ఈనాడు వర్ణము, జాతి, కులము పర్యాయపదములై ప్రాచీన కాలమందు బ్రాహ్మణ భేదమును తెలుపుటకయి వర్ణ శబ్ద మొక్కటి మాత్రము వ్యవహారములోనికి వచ్చినది.

వర్ణ శబ్దమునకు రంగు, జాతిశబ్దమునకు పుట్టుక, కుల శబ్దమునకు సమూహము, సంఘము అని అర్థాలు నిర్వచించుకో వచ్చును.

జ్ఞాన ప్రకటన కాధార భూతమయిన నోరువంటివారు బ్రాహ్మణులని, శౌర్యసంపద కాధారమయిన బాహువులు వంటివారు క్షత్రియులని, పిక్క బలముచే తిరుగుట కాధారమయిన తొడలువంటివారు వైశ్యులని, సకలాంగములలో నీచములుగా నెంచబడు పాదములవంటివారు శూద్రులని నాటి సామాజికులు సమాజ శ్రేయోభివృద్ధి కోసము పెట్టుకొన్నారు. అంతేగాని నిజమునకు బ్రహ్మ ముఖమునుండియే బ్రాహ్మణు లుద్భూతులయినారని, బాహువులనుండియే క్షత్రియులు సంభవించిరని ఊరువులనుండి వైశ్యులు జన్మించినారని, అంఘ్రియుగళము నుండి శూద్రులు పుట్టినారని అనుటలో నిజము రవ్వంతైన లేదని యీ వివరణమువలన విజ్ఞులు తెలిసికొనగలరు.

మరొక విధముగా పైభావములను నిర్ధారణచేయుటకు ఆధారములు చూపించ వచ్చును. ఆకాలమునం దీ బ్రాహ్మణ ప్రభృతి పదాలు నిరంతరము వ్రాయువానిని లేఖకుడనినట్లు, సేనలో కొలువున్నవానిని భటుడన్నట్లును, వ్యావహారిక నామములు గనే యుండినవనుటకు సందేహము లేదు. తరువాతి కాలమునకు, స్మృతులను, పురాణములను రచించిన మహాశయులు బ్రాహ్మణేత్యాది వర్గమువారు బ్రాహ్మముఖము నుడియే ప్రభవించినారని స్థాపించుటకు కొన్నిశ్లోకముల ఉటకించినారు. కాని వారే వ్రాసిన పదాలలో అన్యోన్య విరుద్ధములైన భావాలు పొడసూపునవిగా నున్నవి. మనుస్మృతి జన్మించిన సమయమునకే బ్రాహ్మణుల యాధిక్యత స్థిరపడి కొంతవరకు జన్మనుబట్టియే వర్ణభేదము కలుగుచువచ్చినది. ఈ వర్ణభేదములు కల్పితాలే కాని సత్యాలు

మాత్రము కావు. బ్రాహ్మణులలో నల్లని వారుండుటయు, శూద్రులలో తెల్లనివారుండటయు మనము ప్రత్యక్షముగా గాంచుచునే యున్నాము. కావున అనేకపురాణాలలో విధింపబడిన ప్రకారము వారు చేయుకర్మలవలననే కాని జాతిమాత్రముచేత బ్రాహ్మణత్వము సిద్ధింపదు. పూర్వము ద్విజులుకానివార లనేకులు బ్రాహ్మణత్వము పొందిరి. పుంఖాను పుంఖాలుగా నుదాహరణము లీయవచ్చును. వీని నింతకముందే తెలియజేసితిని. మచ్చునకు మరి రెండుదాహరణములు.

సరస్వతీనదివద్ద ఐలూషుడయిన కవషుని దాసీ పుత్రుడును, కితవుడను అబ్రాహ్మణుడును బ్రాహ్మణు లయిరి.

తండ్రి తెలియని సంకరునికి బ్రాహ్మణత్వము సిద్ధించినది (జాబాలుని కొడుకైన సత్యకాముడు) సత్యము పలుకువాడు జాతిచేత నెట్టి వాడైనను ఆకాలమున బ్రాహ్మణుడుగనే అంగీరింపబడినాడు.

బ్రాహ్మణు లన్యవర్ణములోని కన్యకలను వివాహమాడుచు వచ్చిరి. ఆ వివాహములు విధివిహితము అయినట్లు శ్రుతి, స్మృతులు బహుముఖముగా ఘోషించుచున్నవి.

**" అస్తు వేద విశ్వాస రహితో ధర్మాపరాఙ్ముఖః తన్నానుష్ఠతి**
**స జన్మనా బ్రాహ్మణోపి కర్మచండాలో భవేత్"**

*- (విద్యారణ్యులు)*

ఎవడు వేదమునందు విశ్వాసము లేనివాడయి అందలి ధర్మములందు విముఖుడయి, వాని ననుష్ఠింపకుండునో వాడు జన్మచేత బ్రాహ్మణుడయినను కర్మచేత ఛండాలుడే.

శూద్రాన్నమును తినిన బ్రాహ్మణుడొకమాసము వ్రతము చేయవలయు ననియు, ఎప్పుడును శూద్రాన్నమును భుజించు బ్రాహ్మణు డారు మాసములు వ్రతము సలుపవలె ననియు శంఖ ధర్మశాస్త్ర విధానమున్నదిగాని హరిజనులు ద్ధరింపబడుట కెట్టి తరుణోపాయములను కల్పింపబడకుండుట కడుంగడు

శోచనీయము. విషాద హేతుభూతము. ప్రమాద వశాత్తు ఆర్యజను లీ అనార్య మానవులను స్పృశించుట యనునది సంభవించెనేని వారు మరల శుద్ధులగుటకు మాత్రమెన్నియో ఉపాయములు నిర్మించుకొన్నారు గాని ఆత్మాభిమానపరులు, పౌరుషవంతులు నైన ఈ ఆది మాంధ్ర జాతి కెట్టి యుపాయములను మాత్రమీ ఆర్యసంఘముగాని, శ్రుతి, స్మృతి, పురాణాలుగాని అస్పృశ్యతా దోష నివారణోపాయార్థములు కల్పించలేదు. మను స్మృతి 10వ అధ్యాయము 400వ శ్లోకమున ఛండాలురు ప్రతి లోమజాతి అనియు వారే యస్పృశ్యులనియు వ్రాయబడియున్నది. పై వర్ణములందు పరస్పర సాంకర్యమువలన జనించినవారి కంటుదోషము లేదుగాని బ్రాహ్మణస్త్రీ యందు శూద్రునివలన జనించిన వానికి మాత్రమే యీ అస్పృశ్యతా దోషసూత్రమును ప్రకల్పించుట యెంతటి మహాఘోరము, శ్రుతి, స్మృతి, పురాణేతి హాసముల నుండి వేనవేలు ప్రమాణవాక్యముల నుదాహరింప వచ్చును. కావున నీ చాతుర్వర్ణ్యసృష్టి పంచమజాతి సృష్టి కేవలము స్వార్థ లోలురైనవారే సృష్టించి తమ యాధిక్యత లను నిలువబెట్టుల కోసమయి యీ పాడుపని చేసి మాయనిమచ్చ హిందూ దేశమునకు కల్పించి నారనుటలో నతిశయోక్తి లేదు.

ఛండాల శబ్దమున కర్థము జెప్పినచో దానిభావము తెలియును. ఈ దిగువ వివరణము గాంచుడు.

**"యో మాతరం వా పితరం జిణ్ణకం గతయౌవ్వనం**
**పహుసన్తో నభరతి తం జఞ్ఞ బసలో ఇతి"**

ఎవడు తల్లినిగాని తండ్రినిగాని ముదుసలులై నప్పుడు శక్తి యున్నను పోషింపడో వాడు ఛండాలుడు.

**"యో చత్థానం సముక్కం సే పరం చ మవజానతి**
**నిహనోసేవ మానేన తం జఞ్ఞ బసలో ఇతి"**

ఎవడు తనకు గౌరవము రావలెనని పరులను దూషించునో ఎవడు తననుతాను గుర్తించుకోక గర్వించుకోక గర్వించునో వాడు చండాలుడు.

**"న జచ్చా బసలో హోతి న జచ్చా హోతి బ్రాహ్మణో**
**కమ్మునా బసలో హోతి కమ్మునా హోతి బ్రాహ్మణో"**

జాతివలన నెవడును చండాలుడు కాడు. జాతివలన నెవడును బ్రాహ్మణుడునుగాడు. కర్మనుబట్టి చండాలుడగును. కర్మనుబట్టియే బ్రాహ్మణుడగును.

**"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,**
**శుని చైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినః."**

విద్యా వినయసంపన్నుడగు బ్రాహ్మణుని యందును, గోవునందును, ఏనుగునందును, కుక్కయందును, దానిమాంసము తినువానియందును పండితులు సమదర్శనులై యుందురు.

*- భగవద్గీత.*

**"శ్వానము కోడి పేడి వ్యభిచారి ననామకు నూరబంది ము**
**ట్టైనసతిన్ సురాపుని నిజాన్వయదూరు నశౌచుసూతకున్**
**బీనుగు నెల్క గార్ధభము పిల్లిని సూకరి నంట నప్పుడే**
**స్నానము సేయదాఖలునజస్రము త్రోయగలేదు వహ్నిలోన్"**

*- (రుక్మాంగద చరిత్ర)*

ఈ కులవ్యవస్థ వ్యాకులవ్యవస్థయేకాని మఱొండుగాదు. ఒకానొకనాడు నాటిసమాజ సువ్యవస్థకు నేర్పాటు చేయబడిన వర్ణాలు ధర్మమును అణచి దేశకళ్యాణము, దేశసమైక్యమును చిన్నాభిన్నము నొనర్చినదిగా తయారయి కూర్చున్నది.

అమెరికా దేశములోని నీగ్రోల సమస్యను కొందఱు ప్రబుద్ధులు లేవనెత్తుదురు కాని వారి సమస్య వేరని తలంపరు. ఇదిగో అటువంటివార లీ సమాధానము పరిశీలింతురుగాక!

In America on the basis of race as they belong to the black race, but they are assured of equal

rights, status and treatment in all Socio-religious as well as political fields in American and in England, whereas in India even though all Indians belong to the same race of caucasian they are treated unequally as if they belonged to diffrent races.

- *(S.S. Arakeri, M.A.)*

హిందూదేశమున అస్ప్రుశ్యులుగా నున్నవారికి అమెరికా దేశములో బానిసలుగా జీవించుచున్న నీగ్రోలకును సమాన సామ్యమును నిరూపింపజూచు విజ్ఞులకు పైవచనాలు ఔషధము కాగలదు. హైందవసమాజములో అగ్రవర్ణములుగా ఎంచబడువారికి మాత్రము సకల సౌకర్యములను సృష్టించుకొనిరి. ఈ సౌకర్యములు నిమ్న వర్ణములవారికి దూరము చేయబడుట యెంత గర్హణీయమైన సంగతియో తెలియగలదు.

The nature of caste-system is ambiguous as it is a boon to one caste or community and is great curse to another caste or community. Indian socialogical history makes it very clear that many communities were socially disabled because they belonged to the lower castes, and some communities enjoyed all the previleges because of their higher caste. Therefore caste system is the mother of social injustice one caste enjoyed certain previleges whereas other castes were depreived of social justice.

- *(S.S.Arakeri, M.A.)*

మఱి కొంత యాలోచనము చేయుచో లంపులమారులైన నాటి సామాజిక వ్యవస్థానిర్ణేతలు విధించిన విధింపులు గమనించినచో గుండె జలదరించును.

తామే యీ భూమికి దేవులమని గౌరవములు వారికే జరుగవలయునని శాసించిరి. మరొక మేధావి అనిన కొన్నింటిని పఠింపుడు.

The Brahmins proclaimed themselves as the Gods of this land and they should be honoured

every where. If anybody had an idea of killing a brahmin, then it was a great sin by committing which person would go to hell. So 'Gohatya, Bramhahatya were debarred. The fear of hell made the low caste people serve the higher castes. In this way the Brahmins enjoyed all the previleges in Hindu society and ruled over all the people in the name of Vedas, Gita and God. Therefore Brahmins were the absolute monarchs of Hindu society.

The ruling class enjoys it power and previleges as gifts of God which only the sinful can ever dare to take away from it. In Gita, God announces that all earthly powers are manifestations of his power not only are the priestly previleges of the Brahmins exercised on devine authority not only did Kings and emperors in the past rule as incornations of God but even to day the parasitic land lords claim to be 'The natural leaders' of the peasant masses whom they exploit."

ఈ కాలమున జనించిన మహామేధావియు రాజనీతిజ్ఞుడగు ఎమ్.ఎన్.రాయ్ వచించిన వాక్కులకు దోష మంటింపగలమా?

బహు భయంకరముగా కొనసాగుచున్న కులముల ఘోషలనాడు తక్కువ వర్ణమువాడు అగ్రవర్ణములవారి నెదిరించుట మహాపాతకముగా తలంచి నిమ్నవర్ణాలవారు బెడిసి, జడిసి అణగిపోయెడివారు. నాటి శిక్షలెంత కఠినతమ మైనవిగా నున్నవో యొక యుదాహరణము నీక్రింద పొందుపరచు చున్నాను. గమనింపుడు.

The Sudras had no civil or religious rights. A Sudra, trying to hear the vedic texts shall have his ears filled with molten tin or lac, if he recites the vedas his tongue shall be cut off and if he remembers it, he shall be dismembered. If he

assumes a position of equality with twice born men either sitting conversing or going along the road he shall receive corporal punishment. A Sudra committing adultery with an Aryan women shall have his organ cut off and his property confiscated.

*- (Caste and class in India By Prof.G.S.Gurye)*

కుల వైమనస్యములు బాహాటముగా విజృంభించి నందు వలననే మన దేశము విదేశీయుల పాలనలోనికి వెళ్ళిపోవలసి వచ్చినదని చరిత్ర నిర్ణయించినది. ఈ నిర్ణయము పరమ సత్యము. విదేశీయులు రాకముందు చిన్న చిన్న రాజ్యాలుగా వేలకు వేలుగా భాగింపబడి, దేశసమైక్య విచ్ఛిత్తికి దారి తీసినవి. ఐక్యభావము ముఖ్యముగా లోపించుటకు వర్ణమే కారణము. ఈ హిందూ దేశ నికృష్ట స్థితికి ప్రబల కారణాలు కులాలు మాత్రమేనని గ్రహింపగలము.

Indian History is full of instances where conflicts between small states castes and religious sects were responsible for the introduction of foreign role.

The caste-system was the major factor which was mainly responsible for inviting foreign rule in India, because it created disunity, anti-brother-hood and non-co-operation. People never thought in terms of nation-hood. Indians never realised the value of unity and nationalism but always jealously guarded the interests of their own castes at the cost of other caste. The priestly class never realised that the actions and preachings were anti-social and national and anti-brotherly.

*- (S.S. Arakeri, M.A.)*

జాతీయతా భావము ఎట్లు క్షీణించినదో ఏకారణము వలన దేశమన్యాక్రాంత మయినదో తెలిసికొనగలము. మానవ జాతి మనుగడకే అవమానమును, అసహ్యమును కలిగించు ఈ కుల వ్యవస్థ వలన హైందవ భూమి ఎన్నియో శతాబ్దముల నుండి అంధకార దాస్య నిగళాలలో పాతుకొనిపోయి యుగ

యుగాలుగా చీల్చబడిన అస్పృశ్యులకు ఆయా యుగము లందొక్కొక్క పుణ్యమూర్తి ఉద్భవించి, వారి హైన్య దైన్య జీవన పరిస్థితులకు కన్నీరు రాల్చి వారి జాత్యుద్ధరణకు నడుము గట్టిన వారే ముఖ్యముగా దయానంద సరస్వతి, రామానుజాచార్యులు, నారాయణగురు ప్రభృతులు ఏటికెదురీదినట్లు నాటి సమాజమును లెక్కసేయక పంచములైన హరిజన వర్ణముల వారికి తిరుమంత్ర ముపదేశించి వైష్ణవ మతస్థులుగా చేయుట అపురూపము. ప్రశంసాపాత్రము.

కొందరు మానవ మహనీయుల మాటల సమాలోకింపుడు.

"నాదృష్టిలో కేవలము జన్మచేత యెవడు గొప్పవాడు కాని కొలదివాడుగాని కాడు."

- రామకృష్ణపరమహంస.

"అస్పృశ్యత వేదాలలోను, పురాణాలలోను లేదు (భరత) జాతి యౌన్నత్యమునకు అన్నివిధముల వేఱుపురుగు."

- వివేకానందస్వామి

"అస్పృశ్యత దేశము భదరింపరాని మహాభారము"

- టాగూరు

"హిందూసంఘ శరీరమునకు వ్రణము"

- తిలక్

"అస్పృశ్యత నిశ్చయముగా ఘోరకృత్యము"

- గోఖ్లే

"అస్పృశ్యులనబడువారు ఔన్నత్యమును పొంది సాంఘికముగా వారు పొందవలసిన న్యాయమైన హక్కులను పొందినగాని మనము యథార్థమునకు మనదొకజాతి (దేశము) అని పిలువలేము."

- లాలాలజపతిరాయ్

**"మనము ఆత్మశుద్ధి దయను అగ్ని కుండములో అస్పృశ్యతను ఆహుతి చేయకపోయినచో సాంఘిక విప్లవమనెడి యగ్ని యంటుకొని అస్పృశ్యత పిడికెడు భస్మమై తీరును. సందేహము లేదు."**

**- వినోబాబావే**

**"అంటరానితనము మతమునకు నీతికి సాంఘికాదర్శము లకు చివరకు మన రాజ్యాంగమునకు అన్నిటికి విరుద్ధమే. మానవుల మధ్య కల్పింపబడిన యీ జాడ్య మెంత శీఘ్రముగా నంతరించునో యంత మేలు."**

**- రాధాకృష్ణ**

నవ భారత జాతి నిర్మాత, సబర్మతీ ముని, స్వాతంత్ర్య సమర శంఖారావమును పూరించి దేశస్థులను మేల్కొలిపిన ధర్మప్రబోధకుడు జగజ్జనకుడు అహింసామూర్తి మహాత్మాగాంధి పంచము లనబడినవారికి నూతనముగా "హరిజను"లని పేరుపెట్టి వీరి మహోన్నతికై బహువిధములుగా కృషి చేసెననుటలో అత్యుక్తి లేదు. బాపూజీ నిర్వచించిన "హరిజన" శబ్దమునకు వికృతభావము కల్పించువారు లేకపోలేదు.-ఈ భావము నందెంత సత్యార్థము గర్భితమైనదో కాని గాంధిజీ "హరిజన" శబ్దము నిర్వచించుటలో ఆ మహత్ముడు సాక్షాత్ హరి (భగవంతుడు-విష్ణువు) సంతానమే నన్న పరమసత్యము నిరూపించు నామముగనే వాడినారనుటలో సందేహము లేదు. హరిజనుల సమున్నతి కోసము మహాత్ముని కృషి యనన్యసామాన్యము.కేవల రాజకీయ సిద్ధాంతాల ధోరణిలోనేకాక దేశ సముజ్జ్వల సమగ్ర భవిష్యత్తు విశ్వ ప్రపంచముతో వన్నె గాంచవలెనన్న తలపుతో అవిరళకృషి సాగించిన మహోదార చరితుడు. అడుగువేసిన చోటెల్ల హరిజనుల ఆక్రందనాలు, బడుగుజీవితాలు శీర్ణమై శైథిల్యమైన వారి జీవన విధానాలను గాంచి అశ్రు కణములు రాలిచె ననునది దాగని సత్యము.

ఆ పరమ కరుణామూర్తి అంటరానితనము గురించి ఎంత ఆరాటపడినాడో ఈ దిగువ నాతని మాటలే సాక్ష్యములు.

"I do not want to be born. But if I have to be born I should be born an un-touchable. So that I may share their sorrows, sufferings and affronts levelled at them, in order that I may endeavour to free myself and them from that miserable condition."

గాంధీ మహాత్ముని దివ్యాశీఃపరంపరలు మిక్కుటముగా హరిజనావళిపై నున్నదని మేలుగా చెప్పుకొనవసరము లేదు.

తన తనువు, ధనము,జ్ఞానము, సమస్తమును జాతీయుల(హరిజన) కొఱకు తృణము గానెంచి యనేక క్లిష్టగాథల నెదుర్కొని హిమాలయ నగధీరుడై నిలిచి హైందవులకు సింహ స్వప్నమై కాన్పించి అపారవిజ్ఞానపాథోనిధుల జుఱ్ఱున త్రాగిన అపరయగస్త్యునివలె జాతికి జీవనముగా నిలిచి నవభారత రాజ్యాంగ శాసనముల సృష్టి గావించిన అపరమనువు బిరుద విభ్రాజితుడు డా॥ అంబేద్కరు తన జీతీయులకు గావించిన సేవ అపారమైనది. అమోఘమైనది. ఆయన వాక్రుచ్చిన వాక్కు లిచట ఉటంకించుటకంటె ఆతడే హరిజనుల కోసము ఆత్మను బలిదాన మిచ్చినాడని చెప్పినచో తప్పు గాదనుకొందును. ఆతని విద్యా విశేషములు ఈ కాలమునం దెవరికిని గానరావు.

డా॥ అంబేద్కరు నిరంతర సేవాకృషి మూలకమున రాజ్యాంగములో ఎన్నియో సౌకర్యాలు లభించినవి. నాడు స్రగ్గిపోయి, మ్రగ్గిపోయినవంశము, మరల శిరస్సునెత్తి జీవించుటకు వీలుకలిగిన కాలము వచ్చినది. హరిజను లందరు పూర్వ కాలమున గొప్ప ఋషులే, కవులే, ఆధ్యాత్మికతత్త్వవేత్తలే, దానధర్మక్రియాచణులే, విజ్ఞానులే, రాజ్యపాలకులే, అయిన నేమి మధ్య కాలము సంఘర్షణ కాలముగా పరిణమించుట చేత వారి ప్రజ్ఞాప్రాభవాలు విశ్వదిగంతవ్యాప్తము కాలేక పోయినవి. నేడు మరల కాలము, ప్రభుత్వము వీరియెడల ఎంతో సానుభూతి గఱుపుచున్నది. ఇప్పుడిప్పుడే హరిజనులు గాఢతిమిరములో కొట్టుమిట్టాడచుండగా ఉషోరాగచ్ఛాయలు సమీపమునందే కాన్పించు చున్నవి. హరిజనులందరు చైతన్య స్రవంతిగా

నొక్కటిగానయి మహత్తర దేశసౌభాగ్య మహాభ్యుదయపథములో పయనించు చున్నారు. విజ్ఞాన గహన సీమలలో వికావికలై దారితెలియక యుగయుగాల దాక నశించిపోయిన మహత్తరజాతి భీషణ గహనమును ఛేదించుచు, తమ యభ్యుదయమునకు పథకములను తయారుచేసికొనుచున్నారు. దేశము మీదే; శాంత్యహింసా సూత్రాలతో విశ్వసామ్రాజ్యాధినేతలగు ఆంగ్లభూపుల గుండెలలో కొదమ సింహమువలె తిరుగాడిన బాపూజీమార్గములో బయనించి యశోక ధర్మధ్వజచ్ఛాయలో దౌర్జన్య రహితవాంఛా శంఖారావములను పూరించండి రాజ్యాంగశాసన బద్ధమైన హక్కులను నిలబెట్టుకొనుడు.

ధర్మబద్ధమైన పోరాటమునకే అంతిమ విజయము. మీలో విభేదాలు సవరించుకొని రెండుకులము లేకన్నై విజయమహోత్తాలగిరిశృంగముపై శాంతిధ్వజమును ప్రతిష్ఠించండి. శ్రమించినచో విజయము సాధింతురు. ఉజ్జ్వల భవిష్యత్తు మీకమరును. కార్యోత్సాహులులై ధర్మదీక్షానురక్తులై భారత మహాభ్యుదయ ఘంటాపథమున మీయడుగులు వేయుడు. ఇదే మనదేశము. మాతృ చరణాబ్జసేవకు కంకణాలు ధరించి విశ్వమానవజగత్తులో గౌరవప్రతిష్ఠలు నిలుపుడు.

ప్రజాపతి తనకు సంతానముకావలెనని వాంఛించి తన ముఖమునుండి త్రివృత్తను స్తోమమును పుట్టించెను. పిమ్మట అగ్నిదేవతను, గాయత్రీఛందస్సును రధంతర సామమును మనుష్యులలో బ్రాహ్మణుని, పశువులలో మేకను పుట్టించెను. ముఖమునుండి జన్మింపబడినవిగావున నివిముఖ్యములు. వక్షస్సు నుండియు బాహువులనుండియు పంచదశస్తోమమును సృజించెను. ఆపైని ఇంద్రదేవతను. త్రిష్టుప్ఛందస్సును, బృహత్సామమును మనుష్యులలో క్షత్రియుని పశువులలో గొఱ్ఱెను పుట్టించెను. అవి చాల బలముగలవి. కారణము బలమైన భాగములనుండి పుట్టినవగుటచే మధ్యభాగమునుండి సప్తదశస్తోమమును అతడే పుట్టించెను. తరువాత విశ్వదేవుడు అనుదేవతలను జగతీఛందస్సును వైరూపసామమును మనుష్యులలో వైశ్యులను, పశువులలో గోవులను సృజించెను. ఇవి భోగ్యములు. అనగా అనుభవింపతగినవి. భోజనపాత్రనుండి పుట్టినవి. ప్రజాపతిచరణములనుండి ఏకవింశస్తోమము పుట్టెను. తర్వాత అనుష్టుప్ఛందస్సును వైరాజసామమును మనుష్యులలో శూద్రులును పశువులలో గుఱ్ఱములను సృష్టించెను.

గుణ్యము, శూద్రుడు పరులపై ఆధారపడవలసినవారు. శూద్రుడు యజ్ఞకర్మకాండలు చేయుట కనర్హుడు. పాదము లాధారముగా జేసికొని బ్రతుకవలసినదే.

ఈ తీరుగా విశ్వదేవుడు నిర్మించినాడని తైత్తరీయసంహిత 7 కాం. ప్ర 1. అ.1. గలదు. ఇదెంత న్యాయబద్ధమైనదో విజ్ఞులు తెలిసి కొనలేకపోలేరు. ఇట్టి వ్రాతలనింకను తిలకించినచో నవ్వు పుట్టకమానదు.

శ్రీ స్కాంద పురాణాంతర్గత సూత సంహితీయ శివ మాహాత్మ్యములో: యీ నాలుగు కులాలయొక్కయు అనులోమప్రతిలోమ జాతుల యొక్క యుత్పత్తి నిర్ణయమును కొన్నింటిని గమనింపుడు.

సధవయగు బ్రాహ్మణియందు బ్రాహ్మణునకు చౌర్యంబున పుట్టినవాడు కుండడు

విధవయగు బ్రాహ్మణికి బ్రాహ్మణునివలన పుట్టినవాడు గోళకుడు

శూద్రునకు రాజాంగనకు జనించిన వైదేహ, పుల్కసులు

శూద్రునకు వైశ్యయందు జనించినవాడు పత్తనశాలిక

బ్రాహ్మణియందు నిషాదునకు జన్మించినవాడు ఆపితుండు

నిషాదునకు నృపాంగనయందు పుట్టినవాడు ఆపితుండు

బ్రాహ్మణియందు వైదేహునకు జనించినవాడు రజకుడు

బ్రాహ్మణియందు చండాలునకు జనించినవాడు శ్వపచుడు

శ్వపచునివలన విప్రాంగనకు పుట్టినవాడు గుహకుండు

వైశ్యాంగనకు చండాలునకు జన్మించినవాడు గోళకుడు .

శూద్రునకు విప్రాంగనయందు పుట్టినవాడు చండాలుడు

ఇట్లెన్నెని విభాగములు తైత్తరీయసంహితలో నుటంకింపబడినవి. వీని నవ వారెవరైన నుందురా? ఉన్నచో నివి ఎంత సత్యములో నిరూపణ చేయవచ్చు

భృగువు భరద్వాజుతో నన్నమాటలు శాంతిపర్వము 89వ అధ్యాయము

"శూద్రేచైతద్భవేల్లక్ష్యం ద్విజేతచ్చ నవిద్యతే,
నవై శూద్రో భవేచ్ఛూద్రో బ్రాహ్మణో నచబ్రాహ్మణః"
"శూద్రేచేతి ఏతత్సత్యాతి సప్తకం ద్విజేత్రై వర్గికే ధర్మ ఏవ
వర్ణ విభాగే కారణం, నజాతిరితి"

*(నీలకంఠవ్యాఖ్య)*

జాతి తెలియని సందర్భములో సత్య శమాది గుణములవలననే వర్ణము నిర్ణయింపనగు. సత్యము పలికినందువలన సత్యకామ జాబాలి బ్రాహ్మణుండని నిర్ణయింపబడినట్లు ఛాందోగ్యశ్రుతి చెప్పినది.

బ్రాహ్మణ జాతిలో బుట్టినవారిలో న్యాయప్రవర్తన గలవారు, శుద్ధమగు వర్ణకాంతిగలవారు, సహనము గలవారు, దయాళువులు, ధర్మవిరతులు మాత్రమే బ్రాహ్మణులు.

తమ కిష్టమైన విషయములం దాసక్తి నెఱపువారు, తీక్ష్ణులు, కోపస్వభావము గలవారు, సాహసులు, ధర్మపరిజ్యితులు, ఎఱుపు రంగు కాంతిగలవారగు బ్రాహ్మణులే క్షత్రియులు.

పశువుల పాలించువారు, వ్యవసాయవృత్తి వలన బ్రతుకువారు, స్వకర్మమును జేయనివారు, పచ్చరంగుగలిగిన వారగు బ్రాహ్మణులే వైశ్యులు.

భూతహింస గావించినవారు. అసత్యము పలుకువారు, అల్పులు, తమ పొట్టకేవని నైనను జేయువారు శౌచములేనివారు, నల్లనివారు నగు బ్రాహ్మణజాతివారే శూద్రులు.

ఈ పరమ సత్యసిద్ధాంత ప్రవచనములు పలికినవారు శంకరులు. ఈమాటలు శంకరులు తమ సర్వ సిద్ధాంత సంగ్రములో వ్యాస మతమనియే వాక్రుచ్చిరి.

ఉత్తమ గుణకర్మల ననుసరించియేనాటి కాలములో బ్రాహ్మణా బ్రాహ్మణులుగా వింగడింపబడినారు. క్షత్రియుడైనను ఉత్తమ బ్రాహ్మణత్వమును నందివాడు విశ్వామిత్రుడు.

క్షత్రియుడైన గర్గునకు శిని అతనికి గార్గ్యుడు బుట్టినందున ఆ వంశము బ్రహ్మవంశమయ్యెను. మహావీరునకు త్రతయ్యారుణి, కవి, పుష్కలారుణియు ముగ్గురు కొడుకులు పుట్టి బ్రాహ్మణులయిరి.

అజామీఢుని ప్రియ, మేధాదులగు కొడుకులు బ్రాహ్మణులైరి. భృగుముని అనుగ్రహముచే వీతహవ్యుడు భృగువు ఆశ్రమములో బ్రాహ్మణుడాయెను.

భారతానుశాసనిక పర్వములో (50వశ్లో) శివుడు పార్వతిని వర్ణములగుఱించి విశదీకరించుట గమనించుడు.

**"వయో నిర్నా పి సంస్కారో నశ్రుతం న చ సంతతిః**
**కారణాని ద్విజస్య వృత్త మేవతు కారణమ్."**

జన్మముగాని సంస్కారముగాని విద్యగాని వంశముగాని ద్విజత్వమునకు హేతువుగాదు. వృత్తమొక్కటియే దానికి కారణము.

కావున ఆరువందల సంవత్సరముల క్రితము మాధవాచార్యులు శ్రుతి స్మృతి సూత్రాదులలో జెప్పిన ముఖ్య బ్రాహ్మణులు ముఖ్య క్షత్రియులు, ముఖ్య వైశ్యులు, ముఖ్య శూద్రులు లేరనియు, క్షత్రియ, వైశ్యుల స్వరూపమే లేదనియు పరాశరస్మృతి వ్యాఖ్యలో స్పష్టముగా వ్రాసిరి.

పూర్వకాలములోనే నాలుగు వర్ణములు వాని సంకరములగు అనులోమ ప్రతిలోమ జాతులనేకములున్నట్లు మన్వాది స్మృతీ తిహాస పురాణములు వివరించినవి. భారతయుద్ధకాలమున నుత్తరహిందూస్థానమున 156 తెగలవారును యవనాదులు 26 గురు నున్నట్లు భీష్మపర్వములో వర్ణింపబడినవి. ఇప్పటికి నెన్నింతలు హెచ్చినవో యూహింపగలము.

- *(వర్ణాశ్రమధర్మము)*

ఏతీరుగాంచినను వేదాలలో మాలమాదితలుందురా?

**"వేదచతుష్టయంబు ప్రభవించిన వ్యాసుని దివ్యవాణిలో**
**మాదిగలుందురా? రుధిరమాంసములుంగలయట్టివారువా**
**రాదిమవాసు లక్క టకటా! తలపోసిన నల్లగుండెలో**

సూదులు మోసుకెత్తును కృశోదరి! యెట్లు
సహించుకొందువో."

- (కళాప్రపూర్ణ శ్రీ జి.జాషువాకవి)

"కుర్వంతో విశ్వమార్యం" అను నినాదమును ఋగ్వేదమిచ్చి
నది. ప్రపంచములోని మానవులందరిని ఆర్యమతములో
కలుపమన్నది. ఆ నినాదము ప్రకారమే ఆపస్తంబమహర్షి
దక్షిణాదికివచ్చి యిక్కడనున్న ద్రావిడులందరికిని జంజాలు
వేసి ఆర్యమతంలో చేర్చాడు."

- (కళాప్రపూర్ణ శ్రీ బోయి భీమన్నకవి)

ధర్మప్రబోధకుడు జాతిపిత భారత స్వాతంత్ర్య సమరమునకు శంఖారావమూది నవ భారతమునకు చైతన్యమును గల్పించి యుగయుగాల నుండి అథో జగత్తులో అణగి పోయిన పంచమ జాతీయుల కాపద్బాంధవుడై వారియిడుములకు కన్నీటి బొట్టుల కార్చి జీవితమకతయు వారి క్షేమాభ్యుదయమునకే అంకితము గావించిన పూజ్య బాపుజీని నిరంతరము స్మరించుకొనుట హరిజనుల ప్రథమకర్తవ్యము.

"ఈ గుజరాతుకోమటి సహింపడు పంచమజాతిహింస నీ
యాగమశాస్త్రబాలికల కాయువుగావలెనున్న స్వేచ్ఛలో
భాగమొసంగి నీగృహముబంచకు బిల్వు మరుంధతేయులన్
శ్రీగలభారతీయ! సవరింపుము ధర్మకిరీట మొదలన్."
"నను నీవంటక కంటగించుకొనుచున్నా వన్నచో నారము
గ్గిన పండైన సబర్మతీతబిసి మూకీభావముంబూని భోజనమున్
ముట్టడు సర్వలోకము తమస్సంఛన్నమై దద్దరిల్లును
హిందూసుత! ముందువెన్కలు సమాలోచింపు మింపారగన్."

- (కళాప్రపూర్ణ శ్రీ జిజాషువాకవి)

ప్రభుత్వ మీ నాడ ట్టడుగున జన్మించిన హరిజనులపట్ల ఎంతో సానుభూతి నెఱపి . వారిశ్రేయోర్థము బహుప్రణాళికలవేసి · శాంతిసౌఖ్యముల నెంతయో చేకూర్చుచున్నది. ఇది మరువరానివి. ఈనాడు హరిజనులలో నెందఱో మహామహులుగా, రాజకీయ ధురంధరు లుగా, న్యాయవిదులుగా, సాహిత్య వేత్తలుగా, ప్రముఖవైద్యులుగా, విద్యావేత్తలుగా రాణించుట గమనించినచో దేశములోని వారి స్థానమును తిలకించినచో ప్రభుత్వ మాలంబనముండుటబట్టియే కాదా!

'ఈ జాతి పునరుజ్జీవన మహాభ్యుదయంలోని ఉషఃకిరణాలే డా॥ అంబేద్కర్, శ్రీ జగజ్జీవనరాం వంటి నాయకులు జాషువా, జోసెఫ్, జ్ఞానానందకవి, ప్రసన్న, వేంకట సుబ్బయ్య, మోదుకూరివంటి కవులు, ఆమధ్యలో వివిధ రంగాలలో అభ్యున్నతి పొందుతూ ప్రజానీకానికి అభ్యున్నతి సాధిస్తున్నా ఎంతో మంది శాసనసభ్యులు, మంత్రులు,త విద్యావేత్తలు, అధికార్లు, కళాకారులు వగైరా.

**- (కళాప్రపూర్ణ శ్రీ బోయి భీమన్న కవి)**

హరిజనులు తమవిద్యుక్తధర్మమును గుర్తెఱిగి తామంటరాని వారమనే భావమును దీసివైచి నవభారతములో ముందునకు సాగిపోవుటకు దృఢదీక్షా యత్నముల నొనరింతురుగాక!

## జుగుప్సాకరమైన చరిత్ర

సత్యం గొప్పదేకాని సత్యంతో జనాన్ని నమ్మించడం కష్టం అంటాడు గ్రీకు తత్త్వవేత్త 'ప్లేటో'. కనుక జనాన్ని నమ్మించడం కోసం పుక్కిట పురాణాలను ధర్మశాస్త్రంగా చలామణి చేయడం అవసరమని ఆయన అంటాడు. చట్టంపేరుతో పుక్కిట పురాణాలను అల్లడమే ధర్మశాస్త్రజ్ఞుల కర్తవ్యమని 'ప్లేటో' ప్రవచించాడు.

మన ఆది'లా' దాత మనువు పై పద్ధతులలోనే మానవ ధర్మ శాస్త్రాన్ని రచించాడు. వేదాల్ని శ్రుతులు, ధర్మ శాస్త్రాన్ని స్మృతులని ఈ రెండు కూడ మీమాంస అంటే తర్కానికి అతీతులని మనవు శాసించాడు. శ్రుతి స్మృతులన అనుకూల తర్కంతో తప్ప ప్రతికూల తర్కంతో లేదా హేతువాదంతో పరిశీలిం

రాదని మనుస్మృతి వ్యాఖ్యాతలు "లల్లుకభట్టు" మేథాతిథి చెప్పారు. (Law) లాని ప్రశ్నించే హేతువాదుల్ని, భూతవాదుల్ని దేశం నుంచి వెళ్లగొట్టాలని వారు ఆదేశించారు. ఆనాడు మానవ ధర్మ శాస్త్రం వర్ణా శ్రమ ధర్మ బద్ధం. ఈనాడు ఆధునిక భారతీయ మనుధర్మశాస్త్రం కులధనబంధం కనుక ఆనాడు వర్ణాశ్రమాలని ప్రశ్నించడం ఎంతపాపమో నేడు కులాన్నీ ధనాన్నీ కులధనాలవల్ల లభించే అధికారాన్ని ఐశ్వర్యాన్ని ప్రశ్నించడం అంతేనేరం.

*(ఈనాడు 29.3.1981)*

ఇట్టి భావాలు గల సమాజం అభ్యుదయ పథంలో మానవతా వాద స్వభావంతో పయనించే తరుణ మే నాడు కలుగుతుందో కాలం నిర్ణయించాలి.

## హిందూ సమేకతా సమ్మేళనంలో అస్పృశ్యతా నిర్మూలనకు శపథం.

అస్పృశ్యత దుర్బల వర్గాల పట్ల సాంఘిక ధార్మిక వివక్షతలపై పోరాటం జరిపేందుకు అఖిల భారత హైందవ సమేకతా సమ్మేళనం నేడిచట శపథం పూనింది. అస్పృశ్యత ఒక విధంగా అభివర్ణింప బడింది. హిందు సమాజంలోని వివిధ పంథాలు, సంస్థలకు చెందిన పదివేల మంది ప్రతినిధులు దేశ ప్రజలు నలుమూల నుండి వచ్చి సమ్మేళనంలో పాల్గొన్నారు. ఈ లక్ష్యసాధనకు విరాట్ హిందూ సమాజం ఒక రాజకీయేతర వేదికను ఏర్పారచాలని వారు తీర్మానించారు. విరాట్ హిందూ సమాజవేదిక హిందువులలోని విభిన్న సంప్రదాయకుల మధ్య ఏకత్వాన్ని సౌభ్రాతృత్వాన్నీ నెలకొల్పడానికి కూడ కృషి చేస్తుంది. డాక్టర్ కరణ్ సింగ్ చొరవపై ఈ మహాసమ్మేళనం ఏర్పాటయింది. అస్పృశ్యతా జాడ్యనిర్మూలనం వెనకబడ్డ వర్గాల విముక్తి సమాజ లక్ష్యాలు ఉన్నాయని సభికులకు పంచబడిన ఒక పత్రంలో వివరించబడింది.

ప్రలోభాలు, వత్తిళ్ళు భీతావహధోరణుల నుండి, హిందూ సమాజాన్ని రక్షించేందుకు హిందూ విరాట్‌సమాజ్ మార్గములను ఉపాయములను రూపొందిస్తుంది. సాహిత్య ప్రచారం ద్వారా ప్రజాభిప్రాయాన్ని రూపొందిస్తుంది. ఈ ఆశయాలతో ఏకీభవించే వాళ్లు మాత్రమే ఈ సమాజంలో సభ్యత్వం ఉంటుంది.

ఈ సభలో పాల్గొన్న ప్రముఖులలో జైన ముని ఆచార్యతులసి, సార్వదేశిక ఆర్య ప్రతినిధిసభకు చెందిన రామ్‌గోపాల్ షాలేవాలే, మునిమహాప్రగ్య, సనాతన ధర్మమహాసభకు చెందిన ప్రేమచంద్‌గుప్త, ఢిల్లీ మాజీమేయర్ శ్రీహంసరాజగుప్త శ్రీమతి విజయరాజేసింధియా, మరి అనేక సంస్థల పంథాల ప్రతినిధులున్నారు.

సమ్మేళనం కన్వీనరు డా॥కరణ్‌సింగ్ ప్రసంగిస్తు సాంఘిక దురాచారాల నుండి హిందూ సమాజానికి విముక్తి కలిగించాలని, అట్టి దురాచారాలలో అస్పృశ్యత విషయమొకటని, నేటి దక్షిణాదిన కొన్నిచోట్ల వీథుల్లో పసువులనురానిస్తారు కానిహరిజనులను రానీయడంలేదని హిందూ సమాజంలోని ఇట్టి విచారకర పరిస్థితులవల్లనే హరిజనులు మూకుమ్మడిగా ఇస్లాం లోనికి దారితీసిందని అన్నారు.

## సభలో సంచలనం

వేదికపై హరిజనులెవరినీ కూర్చోపెట్టలేదని కొందరు హరిజనులన్నప్పుడు సభలో సన్నకారు సంచలనం కల్పించింది. ఎం.పి. శ్రీశివనారాయణ సర్స్యానియా, జాటవ్, ఢిల్లీ మునిసిపల్ కార్పొరేషన్ మాజీ మేయర్ శ్రీ సోహన్‌పాల్, సుమనస్కర్ కేకలు వేస్తూ తమ స్థానాల నుండి లేచారు. వారిని సర్దడానికి వలంటీర్లు ప్రయత్నించారు. ఆతర్వాతే వారిని వేదిక మీదికి తీసికొని వెళ్లి ఆసనము లిచ్చి ప్రసంగించవలసిందిగా కోరారు.

సర్స్యానియా తమ ప్రసంగంలో సవర్ణ హిందువులపై తీవ్రంగా దాడిచేసి హిందూ సమాజసేవ లో అందరికన్న ఎక్కువ సేవచేసింది హరిజనులేనన్నారు. హరిజనులు ధనకోసం మతం మార్చుకొంటున్నారనే ప్రచారాన్ని వెంటనే ఆపు చేయాలనీ, హరిజనులు కోరుతున్నది సమాజంలో సముచితస్థానమని అన్నారు.

*(ఆంధ్రజ్యోతి 6.9.1981)*

ఎంత చెప్పినా, చాటినా ఈ అస్పృశ్యతను హిందూ సమాజంలో నుండి వెళ్లగొట్టాలని అనేకులు సంస్కారవంతులు కృషి చేశారు. చేస్తున్నారు. కాని జరుగుతున్న దేమిటి? హిందూ సంఘం బ్రతకాలంటే అస్పృశ్యత ఉండి తీరాలి. అది లేకపోతే ఆసంఘానికి మనుగడ లేదు.

## ఆవేశపరులకు అమృతసర్ పాఠాలు (గోవధ)

"అలవాట్లు మారినప్పుడు అందులో దృక్పథంకూడా మార్పు రావాలి. సహజ పరిణామం నేడు శ్రామిక అవసరాలకు ఆర్థికంగా చర్మకార పరిశ్రమ ఒక కీలక పాత్రగా వుంది. మన పాద రక్షలకు అంతర్జాతీయ మార్కెట్ అమోఘంగా ఉంది. దాని వలన బోలెడంత విదేశమారకద్రవ్యం వస్తుంది. కాని ఏదో ఒక విశ్వాసాన్ని విమర్శించి గోవధను మొత్తంగా నిషేధించాలనడం కూడ తప్పే. జీవకారుణ్యానికి ప్రాధాన్యం ఇవ్వవలసి వచ్చినపుడు మొదటిస్థానంతోడిమానవునకే దక్కాలి. నిజానికి జీవకోటిలో ఇతర జీవరాసులకంటే మానవుణ్ణి అతని మంచిని మనసారా ఆరాధించిన వేదాలూ ఉప నిషత్తులూ మానవునికి పౌష్టికాహారంగా మాంసాన్నీ గోమాంసాన్ని సమర్థించాయి. ఆరోగ్యానికి ఫలాలతోపాటు మాంసాన్ని "మాంసం బృంహణీ యానాం" అని సూచించాడు చరకుడు. అతిథులువస్తే వారికి 'ఔక్షణ' వడ్డించమని సలహా చెప్పింది బృహదారణ్యా కోపనిషత్తు. అక్షము అంటే బలిసిన ఎద్దు కాబట్టి ఔక్షీణం అంటే ఎద్దు మాంసమని శంకర భాష్యం చెప్పుతోంది. అంతేకాదు కల్ప సూత్రాలు గుహ్య సూత్రాలు కూడా ఆవు మాంసాన్ని ఆహారంగా సూచించాయి. వశిష్ఠునకు సన్మానంచేసినపుడు జరిపిన విందు భోజనం గురించి దండాయనుడితో వాల్మీకి శిష్యుడు సౌధాతకి ప్రేలిన జోకులు అన్నీ గోమాంసం గురించే మధుపర్కాలతో ఇటుగోవును దానం చేసిన చేతులతోనే అతిథులు వస్తే గోమాంసంతో సంతృప్తి పరచమని బోధలు చేసినవాళ్ళు మనవాళ్లే.

*- (3. 4. 1982 ఆంధ్రప్రభ)*

ఈనాడు దేశంలో గోమాంసం నిషేధ నినాదాలు దిగంతాలు మారుమ్రోగు నట్లుగా నినాదాలు చేస్తున్నవాళ్లు దీనిని చిత్తశుద్ధిగా గమనించాలి. అసూయా భావంతో విమర్శచేసికొంటే నిజం గప్పబడివుంటింది. ఆనాడు యజ్ఞయాగాదులలో ఉపయోగింపబడుతుంది. గోమాంసమేకదా!

## దారుణ మారణకాండ

గుజరాతులో కులమతయుద్ధాన్ని ప్రేరేపించి వందలాది పౌరులను

బలిగొన్నారు. కాంగ్రెసువారు హరిజన గిరిజనుల పై జరిగిన అత్యాచారాలు కళ్ళు చెమ్మగిల్లుతాయి. 1983 ఉత్తరాంధ్రలో ఉత్తరప్రదేశ్‌లో హరిజనులపై జరిగిన ఘాతుకాలు 5,000 పై దాటాయి. 1966 - 1976 మధ్య పదిసంవత్సారాలకాలంలో 40 వేల అత్యాచారాలు నమోదు అయ్యాయి. ఉత్తర ప్రదేశలో సింగ్‌పూర్ రస్పాల్ కాంగ్రెసువారు హరిజనులను అమానుషంగా హత్యచేశారు. నేలమీద పడి గిలగిల కొట్టుకుంటున్న నిర్భాగ్యులపై కిరోసీన్ పోసినిప్పంటించారు.

*- (ఈనాడు 27.7.1985)*

కారణం కులంలేనితనం. అంటరానివారుగా (బహిష్కృతులు) సమాజంలో ముద్రపడ్డం చేత సవర్ణుల ఆగడాలు మితిమీరి కులాల పోరాటాలకు మార్గాన్ని సూచిస్తుంది. ఇది తప్పు. ఈవిధానం జాతి శ్రేయస్సుకు వికాసానికి సౌభాగ్యానికి అంతరాయం. ఇది మారవలె. హరిజనుల గురించి డాక్టర్ రాంమనోహర్‌లోహియా, గాంధిజీల వాక్యాలు గమనిస్తే ఈ దేశానికి పట్టిన చీడగా మిగిలింది అస్పృశ్యత. ఇది కూకటి వ్రేళ్లతో కూలిపోవాలి. ధ్వంసంకావాలి. డా॥రాంమనోహర్‌లోహియా, గాంధిజీతో; సోషలిజం గూర్చి మీరు ఎందుకు మాట్లడరు?

**గాంధీజీ:** ఈదేశంలో కులం ఉన్నన్నాళ్లు సోషలిజం అసాధ్యం. గాంధీజీ అస్పృశ్యత పోతే కుల తత్త్వం దానంతట అదే సమసిపోతుందని ఆశించాడు గాంధీజీ.

*(29.1.1989 ఆంధ్రభూమి)*

దేశానికి మచ్చ తెచ్చే కులం ఐకమత్యానికి భంగకరంగా వుంటున్న కులం పోవాలని గాంధీజీ ఆశించాడు. ఆ ఆశ ఏనాటికి హిందూదేశంలో పరిఢ విల్లుతుందో?

కులాలు లేవనీ, అవి మానవ కల్పితాలనీ, మానవులంతా ఒకటేననీ, ఈ కులాల వలన ద్వేషాలు, హెచ్చులొచ్చు తగ్గుల భేదాలు అనర్థకాలు, పెరిగి మానవులలోని మంచితనాన్ని నశింపచేస్తుందే తప్ప సంఘీభావనకు తోడ్పడదు.

స్వార్థపరుల దౌర్భాగ్య రాజకీయాలవలన కులం వెర్రి తలలు వేసి వీరవిహారంగా విస్తుంది. దీనిని రూపుమాపాలి. నేటి తరంలోతెలివి మీరిన వాళ్ళున్నారు. కృషి వలన ఉన్నతంగా రాణించగల్గుతున్నారు.

## హిందువులకు కులమే ప్రధానం

"అస్పృశ్యత సమానావకాశములను తిరస్కరించుచున్నది. దానిలో బానిసత్వ మిమిడి యున్నది. హిందువుల సాంఘికార్థిక నిర్మాణంలోనే అస్పృశ్యత అల్లబడి యున్నది. అస్పృశ్యతను తొలగించ వలెనంటే ఈ దేశ ఆర్థికసాంఘిక విధానం పూర్తిగా మారవలసి యున్నది.

- *(బాబూజగజ్జీవనరామ్)*

"You Hindus have no religion your God is in the Kitchen your Bible the Cooking Pot. People here have given up the Vedas and all your philosphy is in the Kitchen. The religion of India at present is dont touchism. The present Hinduism is a degradation."

ఓ హిందువులారా! మీకు మతంలేదు. మీ దేవుడు మీ వంటగదే. మీ బైబిలు వంటపాత్రే ఈనాటి మీరు వేదాలను వదిలేశారు. మీ వేదాంతాన్ని మీ వంట గది పరిమితం చేసికొన్నారు. ఈనాడు భారత దేశంలో వున్న మతం ఒక్కటే అది " ముట్టు కోకు" మతం ఈనాటి హిందూమతం ఒక సిగ్గుమాలిన పాతిత్యం (degradation)

- *(స్వామి వివేకానంద)*

ఈ దుష్ట మతాచారము ద్రావిడులలో (ద్రావిడజాతీయుడు) మొదటలేదు. ఈ భయంకరా చారము ఆర్యులలో మొదటలేదు. మధ్యయుగంలో ఏర్పడిన దనవచ్చును. ఇది ఆర్యవైదిక వాఙ్మయంలో స్పష్టమగుచున్నది.

ఋగ్వేదంలో అస్పృశ్యులు లేరు. ప్రత్యేకమైన తెగలు వేదాలలో నిషాదులనీ, చరిత్రలో ద్రావిడులని అందురు. నీచ కులజుడు వేశ్యాపుత్రుడు మాతంగి యువతి అరుంధతికి భర్త వసిష్ఠుడు బ్రహ్మర్షియై సూర్యవంశానికి గురు పురోహితుడయ్యాడు.

**" జన్మనాజాయతే శూద్రః**
**కర్మణాజాయతే బ్రాహ్మణః"**

హరిజనులు - ఆది ద్రావిడులు

ఆది ద్రావిడ సంఘం వారే హరిజన సంఘం.

## మాల

మల అనగా కొండ. మలలందు తొలుత నివసించుట వలన వీరికి మాలర్ అనిపేరు. ఆ పదం క్రమంగా రేఫం లోపించి మాల అయ్యేనని ఆంధ్రచరిత్ర కారులమాట. మాల నూలు వీరికి తొలుత నూలు వడకుట ముఖ్య వృత్తి. నూలు వడికి నేయువారు అస్పృశ్యలుగారు వీరు ఆ వృత్తి మాని సేద్యం చేసికొనవలసి వచ్చింది. కారణం విదేశీయపు నూలు పోటీ. వీరి పురోహితులను మాల దాసరులందురు.

| | | |
|---|---|---|
| మహారాష్ట్ర పంచములు | - | మహరులు |
| వంగదేశపు పంచములు | - | మాల్‌లు |
| తమిళదేశపు పంచములు | - | పెరియకులు |

*- (యథార్థ భారతి -డా॥త్రిపురనేని వేంకటేశ్వరరావు)*

## మాదిగలు

ఆంధ్రదేశమున హరిజనులలో మఱియొక తెగవారికి మాదిగలని పేరు. వీరి విషయమున రెండు అభిప్రాయములు కలవు. ఆర్యుడగు మాతంగ మహర్షి సహజముగా కోపిష్ఠి యగుటచే ఆర్యులాతని చండాలునిగా పరిగణించి సంఘ దూరుని గావింపనాతడు దక్షిణాపథము ప్రవేశించి కిష్కింధ సమీపమున ఒక కొండపై ఆశ్రమము నిర్మించుకొని యుండెను. అందువలన ఆకొండకు మతంగి గిరియనా పేరు వచ్చెను. అనంతరమాతని సంతతివారిని మతంగిగిరి నివాసులని, మాతంగులని, సంతతివారిని మతంగి గిరినివాసులును మాతంగులని పిలుచు చుండిరి. మాతంగ శబ్దభవమే మాదిగ యనియు నొకయభిప్రాయము. మాతంగి శబ్దం తత్సమం. మాదిగతద్భవం.

ద్రావిడులు తొలుత శాక్తేయ మతస్థులుగావున శక్తికి పర్యాయ పదమగు మాతంగి శబ్దముల వలన తద్భక్తులకు కూడ. మాతంగులను పేరువాడ బడుచుండెనని. మరియొక అభిప్రాయము. ఈరెండు కారణముల వలనను

మాదిగలు చండాలురనుటకు హేతువులుగాక విశేషించివారి యార్యద్రావిడ సభ్యతనే చాటుచున్నవి. ఆదిద్రావిడ సంఘం వారు పూర్వము వీర్యవంతులై యుద్ధము పొనరించునట్లును పరాక్రమవంతులై రాజ్యము లేలినట్టును, కవులై జ్ఞానదాతలైనట్లును ఈ క్రింది చారిత్రాంశము వలన తెలియుచున్నది.

పశ్చిమదేశమందు మళయాళమున కొంతభాగమునకు తుళువ దేశమనిపేరు. బహుప్రాచీన కాలము క్రిందట ఆతుళువ దేశమును పంచములే పాలించుచుండిరి. ఆకాలమున ఉత్తర కర్ణాట దేశములోని వనవాసి నుండి కదంబ రాజులు వచ్చి తుళువ దేశపు రాజులగు అంత్యజులను బాధించుచుండిరి. ఆకదంబరాజులలో మయూర వర్మ ముఖ్యుడు కొరగారులను నిమ్మజాతి రాజు హన్నఖుడను వీరుడు తుళువ దేశీయులకు సహాయుడై కొరగారు రాజయొక్క సైన్యములతో మయూర వర్మను పారదోలెను. తరువాత మయూర వర్మ పుత్రుడగు లోకాదిత్యుడు గోకర్ణము నుండి గొప్ప సేనతో వచ్చి హనశిఖునోర్చి పంచములలో నొక తెగవారగు కొరగారు ప్రభువు కుటుంబమునందలి యొక కన్యను పరిణయమై యచటనే నివసించెను. వారికి బ్రాహ్మణులు మంత్రులుగ నుండిరి. హీనజాతివారుగా నెన్నబడిన యా కొరగారు, రాజైన నందుడు మంగుళూరునకు సమీపము నందలి నందవరము నుండి, గొప్ప నేనలతో బయలుదేరి లోకాదిత్యుని జయించి, యాతని జనులను తుళువ దేశము నుండి పారదోలి, కొరగారు ప్రభుత్వము నట స్థాపించెను. పిమ్మట రెండు వందలేండ్ల నందుని వంశము వారు తుళువ రాజ్యము నిరాటంకముగ నేలిరి. అనంతరము మయూరవంశజుడగు కామదేవుడు వనవాసి నుండి మరల దండెత్తి వచ్చి తుళువ రాజ్యమును జయించి కొరగారులను హీన దశకు తెచ్చెను. ఆ నందుని వంశమున కనకుడను సుప్రసిద్ధ కవి జనించెను. ఈచారిత్రాంశము కూడ హరిజనుల సభ్యతను సంస్కృతినే వ్యక్త పరచుచున్నవి. కావున హరిజనులాదిమద్రావిడ సంతతియని సిద్ధాంతమగుచున్నది. "సర్వేజనాః సుఖినోభవన్తు" ఆత్మవత్సర్వభూతాని, అహింసాపరమోధర్మః' అనిశ్రుతులు ఘోషించుచుండగా అస్పృశ్యతా దుస్సహధ్వను లుప్పతిల్లుట అశుభోదర్కము (యథార్ధ భారతి డా॥ త్రిపురనేని వేంకటేశ్వరరావు.

అస్పృశ్యతకు గోమాంస భక్షణము కారణముగాదు.

" హింసజేయకుంటయే ముఖ్యధర్మంబు
వెనుకజంపుదురట విప్రవరులు
చావు పశువుతినెడు చండాలుడే మేలు
విశ్వదాభిరామ వినురవేమ"

ఇది శ్రీవేమన యోగీంద్రులవారి ఉవాచ. అవిద్యావంతులనియా! నిర్ధనికులనియా! హరిజనులకీ దురవస్థసంఘటిల్లుట! కాదు. పరార్జితముచే జీవించు బ్రాహ్మణాదితరులను అటులనుట లేదు. ఈ పంచములు నిర్ధనులైనను కష్టార్జితముచే జీవించుచున్నారు ఇట్టి వీరిలో మహదైశ్వర్యవంతులు గొందఱు కూడా కలరు. అయితే వీరిని అస్పృశ్యాలనుటకు కారణమే మైయుండును. అటులను వారేమిచెప్పుచుందురనియోచింప

"స్యాచ్చండాల స్తుజనితో
బ్రాహ్మణ్యాం వృషలేనయః"

అనగా శూద్రుని వలన విప్రవనితలకు గలిగినవారు చండాలురు అనుమనుస్మృతి వాక్యము నాధారముచేసికొని చండాలురు గ్రామ బహిష్కృతులుగ నుండవలయునని జెప్పెడి పై శాస్త్రప్రమాణమును జూపి బ్రాహ్మణీశూద్రునకు గల్గిన చండాలుడే పంచముడనియు నందుచే నస్పృశ్యుండనియు జెప్పెదరు. అయినను అట్టియీ చండాలురే పంచములని ప్రమాణము జూపరు. ఈపూర్వోక్త శాస్త్రవ్యాకము ననుసరించి పంచములస్పృశ్యులైన యెడలను. .

"రజకశ్చర్మ కారశ్చనటోజరుధ ఏవచ!
కైవర్త మేద భిల్లాశ్చ స్వర్ణకారశ్చసౌచికః
తలక్షస్తిల యంత్రీచ సూనూశ్చక్రీతధాదృజి
నా పితః కారు కశ్చైవషోడశైతెజనాంగమాః"
ఏతే గ్రామచండాల ఇత్యర్థః

అనగా 1) చాకలి, 2) చర్మకారుడు, 3) నటుడు, 4) దొమ్మరి, 5) పల్లె,

6) మేదరి, 7) భిట్లుండు, 8) కంసాలి, 9) దర్జి, 10) వడ్రంగి, 11) తిలఘూతకుడు, 12) కటికవాడు, 13) కుమ్మరి, 14) ఈడిగ, 15) మంగలి, 16) కమ్మరి అనునీ పదునార్గురు గ్రామ ఛండాలురుగ జెప్పియున్నందున వీరిని గూడా అస్పృశ్యులని వ్యవహరించవలసినదే గదా! అటులని ప్రపంచమున వ్యవహరించకబోవుటకు గతంబెద్దియో? తత్కారణం బేమియో? కాంచెమాలోచించిచూడుడీ.

## అస్పృశ్యబ్రాహ్మణులు

"కిమత్రబహునోక్తేన బ్రాహ్మణాయేస్య వైష్ణవా!
నస్పృష్ట వానవక్త వ్యాన ద్రష్ట వ్యాకదంచన"

వైష్ణవులుగాని బ్రాహ్మణులందరు అస్పృశ్యులు. అసంభావ్యులు అద్రష్టవ్యులు అని యిట్లుచెప్పిరి. ఈ ప్రమాణమును బట్టి వైష్ణవులుగాని బ్రాహ్మణు లందరస్పృశ్యులని వ్యవహరింపవలసిన దేగదా! అటులనెచ్చటను వ్యవహరించని కారణమేమి? మరియు గ్రామపౌరోహిత్యము చేయువారు గ్రామ ఛండాలురనియరియొక ప్రమాణము గలదు ఇంతియే కాదు ప్రస్తుతములో భారతీయుల నందరిని విదేశీయులు "హిందూ" శబ్ద వాచ్యులుగా జేసి వైచినారు. నేడు భారతీయులందరురాశబ్దము చేతనే పిలువ బడుచున్నారు. మరియు నట్లుగనే ఒకరినొకరు బిలుచుకొనుచున్నారు. ఏతచ్ఛబ్దముగాని, ఏతచ్ఛబ్దార్థబోధకముగాని మన గ్రంథములందెచ్చటను గన్పట్టదు. అట్టిహిందూ శబ్దార్థము పారశీక నిఘంటువుల వలన చండాల బానిస శబ్దార్థవాచ్యములగు చున్నవి. అని యిట్లు తత్పండితులు వచియించెదరు. అట్టిచండాలయర్థమును సూచించు హిందూ శబ్దవాచ్యులందరు అస్పృశ్యులని విదేశీయులనవలసినదేనా? ఇట్లు ఆచార భేదము వలన జనించిన ద్వేషముచే యొకరినొకరు నివ్విధిని దూషించుకొన్న ప్రమాణము లనేకములు గలవు. అట్టివాటినన్నిటిని నిజమనినమ్మి వ్యవహరింప బూనినచో భారతీయు లెల్లరు యొక నొకరు స్పృశింపవలనుగాక ఒకరికి మరియొక రస్పృశ్యులై "ఎవరికి వారే యమునాతీరే" అనునటుల యుండక తప్పదు అందువలన నాప్రమాణంబులన్నియు మతావేశములచే జనించిన దూషణలని విసర్జించి పరిత్యజించుట సధర్మమైయున్నది."

"చండాల శబ్దము అంత్య ప్రతిలోమ సంకీర్ణుని యందును ప్రకృత పంచముని యందును వర్తించుటచేతను ఈ యిద్దరిలో నొక్కరే యనుట పొరబాటు. చండాలశబ్దమునకు రెండర్థములున్నవి. అట్టి విషయమై నిఘంటువును జూడుడు.''

**"స్యాచ్చండాలస్తుజనితో బ్రాహ్మణ్యాం వృషలేనయః"**

అని యమరుడంత్య ప్రతిలోమ సంకీర్ణుని నామము పఠియించి తరువాత ననేకనామములకు బిమ్మట

**"చండాలప్లవమాతంగ దివి కీర్తి జనంగమాః . . .**
**నిషాద శ్వప చావాంతే వాన చండాల పుల్కసా"**

అనియిట్లు ఒక ప్రత్యేక స్వతంత్రజాతి వారి పేరులను పఠించుచున్నాడు. అందువలన నీ నామములోని "నిషాద పద" మును గమనించతగినది. ఈ నిషాద శబ్ద వాచ్యుడు "చత్వారోవర్ణాః నిషాదః పంచమః'' అని నిరుక్తములో వైదిక పంచజన శబ్దార్థ నిరూపణ ఘట్టమునందు జెప్పబడిన నిషాదుడితడే. ఈ బ్రాహ్మణీ శూద్రజాతా నులోమ సంకీర్ణుని యందుగూడా నిషాదశబ్దము వర్తించుటచేత నా యనులోమ సంకీర్ణుడే వేదోక్త పంచజనులలోని పంచముడు గాకూడదా యని యంటిరేని యదిసరికాదు. అతనికి పంచమత్వ వ్యవహారమేలేదు. అదియునుంగాక నతనిని శూద్రునకంటె ప్రత్యేకముగా పఠింపనవసరం లేదు. అనులోమ సంకీర్ణులు మాతృజాతిని పొందుదురు. ఈవిషయములో పూర్వాచార పరాయణులు గూడా ఏకీభవించుచున్నారు. ఇతర సంకీర్ణులను విడిచి యొక సంకీర్ణుని మాత్రము పంచమునిగా చెప్పుటలో స్వారస్యము లేదు.

- *(పంచముల చరిత్రము బ్రహ్మ శ్రీ కావ్యకంఠ గణపతి శాస్త్రి)*

పంచములు వర్ణ నిర్ణయముగల వైదిక మతమువారు గాక తద్భిన్న మతము వారై యుండవచ్చునని తోచుచున్నది. వైదిక గ్రంథముల ననుసరించియే పంచముల స్థితి గతులను తెలుసుకుందము. శూద్రుడు పరిచర్య జేయుటయే స్వభావజన్మమైన కర్మగలవాడు అనునీ వైదిక మతసిద్ధాంతమును బట్టియు పంచముల యాచార వ్యవహారాదులను బట్టియు వైదిక మతము వారు శూద్రులని వ్యవహరించి పిమ్మట

తమ కు తంత్రములు సాగుబాటగు కాలానుకూలతచేత పంచములని పేరిడిరి. అట్టివారిని అంటరాని వారినిగాను.

బహిష్కృతులుగను జేసిరనుటను బోధకంబగుచున్నది.

**"అప్పటి వారిప్పటి జాతి భేద మెరుంగరు ఆర్యులు అనార్యులన్న భేదము తప్ప మరియే వర్ణభేదమును అప్పుడులేదు."**

***-(పంచముల చరిత్రము - కీ॥శే॥ కొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు)***

ఆర్యులు సంపూర్ణముగ మాంసభక్షకులుగ నుండుటయేగాక గోమాంస భక్షకులుగా గూడనుండిరి. ఇంతియేకాక గోమేధము కూడా అచ్చటచ్చట సంభావింప బడుచుండెను. భవభూతి యుత్తర రామచరిత్రలో వాల్మీకి ఆతిథ్యమొసగిన సందర్భమున జాగరూకులమై పరీక్షించినచో వసిష్ఠుడెట్టి తరపి పెయ్యను. జంపి విందుచేసినది తెలియుగలదు. మరియు నౌకమహారాజు నిత్య బ్రాహ్మణ సమారాధనకై గోవులను జంపి యాచర్మములను మెట్టగా వైచిన అందుండి స్రవించిన ద్రవమే చర్మణ్వతీ నదియయ్యెనన్న భారతకథ. మనకన్నులన్ దెరచి సత్యమును మోమోటమిలేకుండా జూపింపగలదు. (అనుశాసనిక పర్వము 3వ ఆశ్వాసములోరంతిదేవుని చరిత్రయందుగన్పట్టుచున్నది.)

## మాదిగలు (ప్రథమ దశలో)

**"చండాలశ్వపదానాంతుః బహిర్గ్రామాత్ప్రతిశ్రయః"**

అనగా చండాలునకును శ్వపచునకును, యూరివెలుపల గుడిపెలుండ వలయును. అని యిట్లు చెప్పుట జూడపంచమజాతికి అసుర,అనార్య, శ్వపచ,శఘ్ను,దశ్యు అనునీనామములు ప్రథమ దశలో నుండుట నిర్వివాదాంశము.

ఇక మధ్యమ దశలో ఏ పేరుతో పిలువబడుచుండిరో విచారింతము, ఈ పంచముల లోని అంతఃశాఖవారుగు మాదిగలు జాంబవంతుని వంశజులమని చెప్పుకొనియెదరు. 1891 సంవత్సరము మైసూరు జనాభా లెక్కలను బట్టి ఈ పంచములు జాంబవతీ జాతివారని యుదాహరింపబడియున్నది.

పంచమజాతి సంభవుడై మహాకవియై వెల్లాల జాతి స్త్రీని వివాహముచేసికొనిన తిరువల్లురు శైవమతప్రవిష్టుడు నందనారు శైవమతప్రవిష్టుడు. ఎంబెరుమావారను పంచమ జాతీయునికడ శ్రీమద్రామానుజాచార్యులు వైష్ణవ మంత్రోప దేశము పొందుట పంచముల గొప్పతనమునకు నిదర్శనము.

- (పంచముల చరిత్రము)

ప్రథమ మధ్యమ దశలలోన భారతీయులాచరణ భేదముచే ఆర్యానార్యులను వేరు వేరు పేరులతో వ్యవహరించుకొనుచున్నను సంబంధ బాంధవ్యములు విడువలేదని తెలియుచున్నది. ఊర్వశియను వేశ్యకు వసిష్ఠుడు అతనికి చండాల స్త్రీ గర్భమున "శతుక్కును", వానికి "పుంగనూరు" యనుమాలదాని గర్భమున "పరాశరులున్నూ" ఆతనికిబెస్త స్త్రీ గర్భబున "వ్యాసులు" జనించిరి. ఈ వంశాను క్రమణికనుబట్టి ప్రథమ, మధ్యమ దశలలో ఆయుభయులగు ఆర్యానార్యులకు సంబంధ బాంధవ్యము లున్నవనుట కిసుమంత సందియముండదు. ఇట్లు సంబంధములుండుట చేతనే.

**"అంత్యజాతి ద్విజాతిశ్చ ఏక ఏవ సహోదరః**
**ఏకయో విప్ర మాతశ్చ ఏక శాఖేన జాయతే"**

అనగా బ్రాహ్మణులు అంత్యజాతులను వారును ఏకగర్భ సంజనితులనియు ఇందుచే సహోదరులనియు నొకే శాఖయనియు నిట్లు నిరూపించుచున్నది. ఆర్యా నార్యకులకు సంబంధబాంధవ్యములుండ అస్పృశ్యత కలిగియున్నదని చెప్పుట కవకాశముండదని దృఢముగ పేర్కొనబడుచున్నది.

ఈ యస్పృశ్యత మతత్రయములోని భాష్యకర్త లెవరికిని ఇష్టముగ నుండలేదు. స్వార్థపరులగు నార్యుల ప్రోద్బలముచే ఈ యస్పృశ్యత దృఢముగ పాతుకొని యుండుటవలన మతత్రయ భాష్యకర్తలు తన్నివారణ మొనర్ప జాలక పోయిరి. అయినను గ్రంథాదులయందు తన్నివారణ వాక్యములు గన్పట్టుచున్నవి. ఇట్లుండినను మొత్తము నకు శ్రీ మచ్ఛంకర భగవత్పాదులకాలమున ఆర్యానార్య సంబంధ బాంధవ్యములను పోగొట్టియు అంతకు పూర్వము ఆర్యులతో కాపురముండిన అనార్యులు ఆర్యులతో జేరికాపుర ముండుటకై ఇష్టములేని వారై

వేరుగా కాపురముండిన అట్టి అనార్యులను గ్రామ బహిష్కృతులనియు వారంటరానివారనియు చెప్పరానివారనియు ఈ మొదలగు లక్షణములను క్రమక్రమముగ ఆచరణయందుంచిరని తెలియుచున్నది. అటుల అంటరాని తనమును అప్పుడుగాని తత్పూర్వముగాని ప్రవేశపెట్టుట చేతనే అంటరాని తనము గూర్చి శ్రీమచ్ఛంకరభగవత్పాదులకును పంచమునకును గలిగిన వాదోప వాదములతో ఈ మచ్ఛంకరులు తద్వాదము నొప్పుకొని, పంచముని బహూకరించినట్లు, మనీషా పంచకమువలన తెలియుచున్నది. (పంచముల చరిత్రము)

వివేక విజ్ఞానములతో సమీక్ష గావించిన యెడల వీరిని పంచములని పిలువ వచ్చునా? స్వార్థపరులు సృష్టించి దేశానర్థదాయకములగు చేతలకు ఊపిరిపోసి నాటినుండి దాక తమ పబ్బమును గడుపుకొనుచున్నారు.

## అస్పృశ్యత

"తలాతోకాలేని పూర్వాచారాలపట్ల పూజ్యభావము, కుల ద్వేషాలు, వర్ణ వ్యవస్థా, పరదా (ఘోషా) బహుభార్యత్వమూ బాల్య వివాహాలు, మొదలైన వాటివల్లనే మనం అధఃపతితుల మయ్యాము. మన దేశభక్తి కులతత్వం క్రిందికి దిగజారిపోయింది. అంచేత సామాజిక స్వరూపాన్ని పూర్తిగా మార్చాలి. ఛాందసుల అంధ విశ్వాసాలపై దండ యాత్ర సాగించాలి. కులతత్వానికీ, బాల్యవివాహాలకీ మనసంఘంలో ఎలాంటి అవకాశం యివ్వగూడదు. (1928 - జెయన్ గుప్త భారతజాతీయ పునరుజ్జీవనం)

"కుల తత్వం పూర్తిగా అంతరించినప్పుడే ఇండియా-ప్రపంచం లోని నాగరికత గల స్వతంత్రదేశాల వలె గౌరవస్థానం పొంద గలదు."

- (మోతీలాల్ నెహ్రు)

"భారతదేశంలో బాధ్యతాయుతమైన స్వయం పరిపాలన (Responsible SelfGovernment) ఏర్పడినట్లయితే మతవర్గవిభేదాలతో నిమిత్తము లేకుండా భారత ప్రజలందరు సంపూర్ణ సమాన సాంఘిక హక్కులు గలవారుగనే ప్రకటింప

గలుగుతాం. విద్యాలయాల వంటి అన్ని సంస్థల్లోనూ అందరికి ప్రవేశార్హత కల్గించి సిసలైన సత్సంప్రదాయాన్ని ఏర్పాటు జేయగలుగుతాం.

- *(శ్రీ జి.ఏ. నటేశన్)*

**"సాంఘిక దురన్యాయము హిందూమతానికే చేటు."**

**- *(శ్రీబులాభాయ్ దేశాయ్)***

"దళితజాతుల సమస్య తక్కిన సమస్యలన్నిటి కంటె అతి క్లిష్టమైనది. నిర్హేతుక మైన నిరంకుశధోరణులతో సంక్షోభాన్ని సృష్టిస్తున్న పరిపాలకు కిది ఘోరమైన అవమానం. దళిత జాతులనబడే యీ అస్పృశ్యులు మేల్కొని భారతీయులు సిగ్గుపడేలా జేయ గల తరుణం ఆసన్నమైనది. హీనవృత్తుల ననుసరిస్తున్న యీ కోట్లాది ప్రజానీకం కొన్ని వేల సంవత్సరాల నుండి దురదృష్టకరమైన జీవితాలను కొనసాగిస్తూన్నారు. ఇతరులకిది ఆశాజనకమైన వసంతకాలమో, లేక పశ్చాత్తాపం చెందవలసిన గ్రీష్మ కాలమో తెలియదు కాని యీ దురదృష్టవంతులు యావజ్జీవితం నిరాశామయమైనారు. మానవహక్కుల పరిరక్షణ గూర్చి పెద్ద పెద్ద ఉపన్యాసాలిచ్చేవారు వారి అండన పనిజేసే దళిత వర్గాల వారికి వాటిని నిరాకరించడమనేది అతిక్రూరమైన విడ్డూరం దీనజనోద్ధారణకై యితర దేశాల్లో కొందరు యుద్ధరంగంలో నిలిచి రక్తం చిందిస్తూండగా యిక్కడ పీడిత ప్రజానీకాన్ని నికృష్టమయిన పరిస్థితుల్లో ఉంచివేయడం న్యాయంగానీ, ధర్మంగానీ ఎలా ఔతుంది? అణగద్రొక్క బడిన యీ అస్పృశ్యులు సైతం ఈ గడ్డమీద పుట్టి పెరిగిన మానవులే. అహంకార పూరితులైన అగ్రవర్ణాల వారిలో ప్రవహిస్తున్నట్లే, వీరిలోనూ ఎఱ్ఱని రక్తమే ప్రవహిస్తున్నది. ఉన్నత వర్ణాల వారికి వలెనే దళితజాతుల వారికి సైతం సమానహక్కులను కలుగజేయడం మానవధర్మం. దాస్య విమోచనకై పోరాడుతున్న మన దేశంలో దళిత జాతులంటూ ఉండడం మన మెంతో విచారింపవలసిన విషయం."

- *(శ్రీ అసఫాలీ)*

"ఈ దేశంలో పుట్టి పెరిగిన ఈ ఆదిమజాతుల వారు ఆర్యుల దండయాత్రలో పరాజితులై బానిసలుగా చేయబడ్డారు. ఆహారం, వస్త్రధారణ,

నివాసం అపరిశుభ్రంగా నుండడమే కాక నిత్యం త్రాగుటకు అలవాటైన వీరిలో వివాహ విధి సులభమైన పద్ధతిలో జరిగిపోతుంటుంది. వీరిలో పరస్పర ప్రేమాభిమానాలు మెండుగా ఉంటాయి. కర్కశత్వం, క్రూరత్వం ద్రోహ చింతన వీరిలో చాల తక్కువ. వీరికి కాస్తంత మేలు జేసిట్లయితే కృతజ్ఞతతో తబ్బిబ్బయిపోతారు."

*- (అనిబిసెంట్)*

"అస్పృశ్యులు హిందూసమాజంలో ఒకభాగముగా జీవింపగల్గుతున్నారు? సామాజిక రూపంలో యీ రెండు వర్గాలకు మధ్య ఏలాంటి సంబంధమైన ఉన్నదా? సహ జీవన రూపంలోగానీ, బంధు రూపంలోగానీ, వీరిరువురి మధ్య ఏలాంటి సంబంధము లేదుగదా! ఒకర్ని మరొకరు తాకడానికి కూడా వీలులేదే? అస్పృశ్యుడు హిందువును తాకినట్లయితే హిందువు మైలబడి పోతాడు. హిందువులు తరతరాలుగా అస్పృశ్యుల్ని వేరుగా ఉంచి వేరు వర్గంగా పరిగణిస్తున్నారనేది-నగ్న సత్యం. హిందువులు తామొక ప్రత్యేక వర్గమని భావిస్తుండడం వల్లనే గదా! వారిని సవర్ణులనీ, అస్పృశ్యులను, అవర్ణులనీ పిలవడం సాంప్రదాయకమైనది. అనగా హిందువు చాతుర్వర్ణ వ్యవస్థకు చెందినవారు గనుక వారు సవర్ణులైనారు. అస్పృశ్యో చాతుర్వర్ణ వ్యవస్థకు చెందనివారు గనుక వారు అవర్ణులైనారు. తమకులాలను కాపాడుకోవాలంటే అస్పృశ్యతను విధిగా పాటించాలనేది హిందూమత సిద్ధాంతం. హిందువులకు అస్పృశ్యులకు మధ్యబలమైన ముళ్ల తీగె ఏర్పాటు చేయబడియున్నది. అస్పృశ్యులీ ముళ్ల తీగను దాటేందుకు హిందువు లెంత మాత్రం అంగీకరించరు.

*(డాక్టరు అంబేద్కర్ - (ఆది భారతం) భారత జాతీయ పునరుజ్జీవనం)*

## బుద్ధుడు, మహావీరుడు

తెగల పాలకుల నుండి వచ్చినవారు జన్మ రీత్యా క్షత్రియులు. వీరు వేద ప్రామాణ్యాన్ని పూర్తిగా త్రోసి పుచ్చారు. ధర్మశాస్త్రాలను వర్ణ వ్యవస్థను విమర్శించారు. సమానత్వాన్ని బోధించారు. భారతీయ తాత్విక వికసనకు ఇది పెద్ద ముందడగు, తక్కువ కులాలు పై శ్రేణికి చేరుకోవడానికి బౌద్ధం, జైన, చార్వాకాయి తోడ్పడ్డాయి.

*(భారతీయతత్వశాస్త్రము - ఏటుకూరిబలరామమూర్తి)*

"కుల భేదాల ఉగ్రరూపమే అస్పృశ్యుల సమస్య. అది మహా భయంకర సమస్యగా భారత దేశంలో రూపు దాల్చింది. హరిజనులని చెప్ప బడేవారిని తాకగానే ఎంతో మంది స్నానం చేస్తారు. ఎన్నో చోట్ల హరిజనులు ఉన్నత కులాల వారు నివసించే వీధుల వెంట నడచి వెళ్లలేరు. హిందువుల మత గ్రంథాలు ఈ అన్యాయాన్ని ఆధ్యాత్మిక పరంగాను తత్వ రీత్యాను వ్యాఖ్యానిస్తున్నాయి.

గాంధీజీ అంటరానితనాన్ని నిర్మూలించదలచినా హిందూ శాస్త్రాలను వేదాలను తనతోపాటు తీసుకు వెళ్లగోరుతున్నారు. ఇది బురదతో బురదను కడగడంవంటిదే.

భవిష్యద్దర్శకుడైన అక్బరు భారతీయులందరినీ ఒకే జాతిగా రూపొందించాలని కలలుగన్నాడు. అయితే అతని కలలు కల్లలుగానే మిగిలిపోయాయి. అక్బరు తరువాత హిందూ-ముస్లిం పాలకులు, ఆ జాతీయైక్యతను ఇష్టపడలేదు. భారతదేశం ఆంగ్లేయుల అధీనం కావడానికి పూర్వం ఇక్కడ మహారాష్ట్రుల రాజ్యం బలంగా ఉండేది. అయితే అదికూడా బ్రాహ్మణ-బ్రాహ్మణేతరుల కలహాలతో ధ్వంసమైపోయింది. ఈ భేదాలకారణం గానే మనమీ దశకు చేరుకున్నామని మన గతకాలపు చరిత్ర తెలుపుతోంది.

మనం ఈ కులాంతరాలను చాలకాలం పాటించలేమని ప్రపంచం పోకడ తెలుపుతోంది. ప్రపంచ గతిని చూచి భారతదేశంలోని అస్పృశ్యులు ఇంకెంతమాత్రం అస్పృశ్యులుగా ఉండడానికి సిద్ధంగాలేరు. అట్టడుగు కులాలవారు అట్టడుగునే వుండి పోవడానికి సిద్ధంగాలేరు. అంటరానివారితోను అట్టడుగు కులాల వారితోను అన్యాయంగా వ్యవహరించడమేకాదు. ఆర్థిక స్వాతంత్ర్యం కూడా వారికి లేకండా చేయబడుతోంది. ఇటువంటి స్థితిలో వేలకొలది సంవత్సరాలకు మనువు వారిని ఉంచిన స్థానాల్లోనే వారుంటారా? అదీగాక స్వాతంత్ర్య ప్రియులు ఈ దుర్మార్గానికి వ్యతిరేకంగా పోరాటం ప్రారంభం చేశారు. వారు దీని కోసం ఎటువంటి త్యాగాలకైనా సిద్ధంగా ఉన్నారు. వారికి సంబంధించి నంత వరకు ఈ సామాజిక పోరాటం రాజకీయ పోరాటాని కన్నా ఏవిధంగాను తక్కువైందిగాదు. కుల భేదాల అగడ్తలు పూడ్చునంత వరకు జాతీయ సమైక్యతకు పునాదులు వేయలేమని వారికి తెలుసు

ఈ విషయంలో మతమే పెద్ద అడ్డంకి అనే నిజం కూడా వారెరుగుదురు. కానీ వారు మతాన్ని లక్ష్య పెట్టడం లేదు. వారు కుల భేదాలతో పాటే హిందూ మతాన్ని, ఇస్లాం మతాన్ని కఱ్ఱతో బాది సముద్రంలో విసరి వేయబోతారు.

(ఈ సమాజ దుష్టత్వం పతనం కాకతప్పదు - రాహుల్ సాంకృత్యాయన్)

"కాదు నాలో నున్న నీలో నున్న బ్రహ్మ మొకటే. ఆత్మ తత్వ మొకటే యగుటచే అంటరాని తనం మైలపడుదు మనుకొను భ్రాంతి కేవలం భ్రాంతియే. అది సత్యం కాదు. మిథ్యయే.

ఛండాలుడైనను సద్బ్రాహ్మణుడైనను నాకు బ్రహ్మతత్వమున ఏకతత్వము బోధించు వాడే నాగురువని స్తోత్రం చేసెను మనీషాపంచశ్లోకములలో.

## "వైష్ణవ మతసిద్ధాంతములో అస్పృశ్యతకు తావే లేదు."

"వ్యాసుని తండ్రి పరాశరుడు ఛండాల స్త్రీకి బుట్టినాడని తెలుపుతూ వేదవ్యాసునిచే విభజింపబడిన వేదములు తమ మూల ధనమని బ్రాహ్మణులేల వచింతురు? ఛండాలస్త్రీకి జనించిన పరాశరుని కొడుకగు వేదవ్యాసుడు నియోగముచేత అంబికా అంబాలికలకు గర్భధారణము గావించి ధృతరాష్ట్ర, పాండుమహారాజులకు జన్మ దాతయైనాడని భారతేతిహాసమున స్పష్టముగా ఘోషిస్తున్నది గదా! దానివల్ల పాండవులు కౌరవులంతా వారి తర్వాత వారంతా హీన జన్ము లెందుకు కాలేదు. వీటికి ఏకైక సమాధానము జన్మతో యెట్టి వర్ణము నిర్ణయింపబడదు. కర్మ చేతనే వారు మహామహులు కాగలిగిరనునది సుస్పష్టమైన విషయము.''

దీని ప్రకారంబుగా పంచమ కులమన్నదేది?

- (అరుంధతీ చరిత్రము - నములకంటి జగన్నాధము)

" ప్రాచ్య సంస్కృతి లోని యెన్నో విషయాలు అబద్ధాల మీద అసత్యాలమీద ఆధార పడివున్నై. వాటిని దులపాలి. పాత నీరు పోనిది పాత రక్తం వీడనిది క్రొత్తవి రావడానికి సావకాశంలేదు

- (పిలకరాయళ్లు - ఆవుల గోపాలకృష్ణమూర్తి)

అస్పృశ్యత గురించి ఆక్రోశించిన పెద్దలు

*- (ఆచార్యులు - అస్పృశ్యత ప్రభ - 25-5-69)*

"సోదర భావమూ,ధర్మమూ, ఈదేశంటో మిగిలి ఉన్నట్లు లేదు. అస్పృశ్యత ఒక్కటే నిలిచి ఉన్నట్లుంది. దీనులారా! దరిద్రులారా! పతితసోదరులారా! రండి మన మందరమూ ఆ రామకృష్ణుని బిడ్డలము॥ అని కంఠమెత్తి ఘోషిస్తూ అస్పృశ్యత అనే ఈ తెరను తొలగించే సుదినము ఎప్పుడు వస్తుందో కదా! అస్పృశ్యులను ఉద్ధరిస్తేనే కాని భారతమాత మేలుకోదు. వారికి మనం అన్న వస్త్రాదులను సమకూర్చలేకపోతే మనం బ్రతికి ఉండిఏమి ప్రయోజనం?

*- (స్వామి వివేకానంద (ఆచార్యులు-అస్పృశ్యత) - ఆంధ్రప్రభ 25-5-1969)*

"ఇది (అస్పృశ్యత) ఒక వ్యాధి. మానసిక జడతకు దురభిమానానికీ, ఇది ఒక చిహ్నం. ఇది హిందూ ధర్మంలో ప్రవేశించిన కుళ్ళుపాపం.'

*- (గాంధీజీ ఆచార్యులు - అస్పృశ్యత (ప్రభ 25-5-69)*

"అస్పృశ్యతను పాటించడానికి శాస్త్రాలలో ఆధారం లేదు. పరమేశ్వరుని మందిర ద్వారం ఎవరికి కాని మూయ బడలేదు. అది మూయించితే అందులోని వాడు పరమేశ్వరుడుకానే కాడు. అస్పృశ్యతను పాటించడం పరమేశ్వరుని యెడల పాపం చేయడమే. అస్పృశ్యత ఒక వేళ పరమేశ్వరునికి కూడా ఆదరణీయమైన పక్షంలో నేను ఆపరమేశ్వరుని గుర్తించను.''

*- (లోకమాన్య బాలగంగాధర్ తిలక్)*

" ఏ మతం మానవులను అవమానిస్తుందో ఆ మతం మిధ్యమతం. ఏమతం మనుష్యులను అంధులునుగా జేసివారి నోళ్ళు మూసి వేస్తుందో ఆ మతమే అస్పృశ్యులనబడేవారి యెడల అస్పృశ్యతను పాటింపచేస్తుంది. మనుష్యుడు మనుష్యుని పీడిస్తే. దాని వల్ల మానవత్వానికే గాయం తగులు తుంది. ఆ గాయం వల్ల మరణమే ప్రాప్తిస్తూంది''

*- (విశ్వకవి రవీంద్రుడు)*

"పండిత మదనమోహనమాలవ్యాను మించిన నిష్ఠాగరిష్ఠుడైన హిందువు ఇటీవల కాలంలో జన్మించలేదేమో? ఆతని మాటలివిగో''

" ధర్మశాస్త్రం ఏ ఒకరి సొత్తూ కాదు. పరమేశ్వరుని జపించడం, దర్శించడం నూతిలో నుంచి నీళ్లు చేదుకోవడం విద్యను అభ్యసించడం - ఈ మొదలైనవాటికి అందరికీ సమాన మైన అధికారం వుంది."

- (పండిత మదనమోహన మాలవీయ)

"ఇంతకూ ఈ అస్పృశ్యు లెవరు? దక్షిణాఫ్రికాజులూ దేశంనుంచి వచ్చిన వారా? నరకాన్నుంచి బయటకు నెట్టబడిన వారా? స్వర్గం నుంచి క్రిందికి త్రోయ బడినవారా? సవర్ణులదీ వీరిదీ ఒకే సంతతికాదా? చైతన్య మహాప్రభువు, కబీర్, గురునానక్, దారూ, గురుగోవింద్, మొదలైన సంస్కర్తలు హిందువుల అస్పృశ్యతా పాపాన్ని నిరసిస్తూ గొంతెత్తి ఘోషించారు. కాని వారి మాటలు చెవిటివారి చెవుల్లో పడినట్లయింది. "సవర్ణులు చేసిన పాపం యొక్క ఫలితం ఇప్పుడు యావద్భారత దేశమూ అనుభవిస్తోంది."

- (శ్రద్ధానందస్వామి)

"స్పృశ్యతా, అస్పృశ్యతా అవేవో మతం అన్నమాట? అవును. తాకుతాం కుక్కకూ పిల్లికీ ఆహారం తినిపిస్తాం. కాని మనుష్యుడంటేనే రోత. మనుష్యులంటే రోత. వాస్తవానికి అస్పృశ్యుడెవరు? అంటురోగాలతో బాధపడుతున్న వాడు అలాంటి వానిని దగ్గర బంధువులు కూడా తాక కూడదు. నన్ను ముట్టుకోకు. అని తోడిమనిషిని అంటామే, వివిధ రోగాలను సంక్రమింపజేసే సూక్ష్మజీవులను దూరం దూరం అంటే అవి లక్ష్యపెడతాయా? వాటిని నిరోధించడానికి మనకు స్వతః శక్తి లేదు. క్రిమి సంహారక ఔషధాలు వాడవచ్చుననుకోండి. అది వేరే విషయం కలరా, ప్లేగు వంటి క్రిమి జనిత వ్యాధులు వరకు అదుపులోకి వచ్చాయి. మరి ఈ అస్పృశ్యతా నిర్మూలనం అయ్యే లక్షణాలు కనబడలేదు. అస్పృశ్యతా వ్యాధి కేవలం శారీరకమే కాదు. మానసికం కూడా. శరీరంలో తాకడానికి అభ్యంతరం లేకపోయినా కుల తత్వాన్ని పాటించి ఇతరుల యెడల ద్వేష భావం వహించి మానసికంగా వారిని దూరంగా ఉంచుతున్నాం. "ఇది మానసిక అస్పృస్యత". ఈ రోగాలకు మందులేదా? లేకేమి? ఉంది. ప్రాచీన గ్రంథాలలో పేర్కొనబడిన ఔషధాలు ఉన్నాయి

## "యస్తు సర్వాణి భూతాని ఆత్మన్యే వాను వశతి
## సర్వ భూతేషు చాత్మానంతతోనవుజుగుపతే॥"

సమస్త భూతాలలోనూ తననూ, తనలో సమస్త భూతాలను చూచే వారికి ఇతరుల మీద ఏవగింపు ఉండదు. మందు సేవించడం కొంత అలవాటు పడాలి. మనది దీర్ఘ వ్యాధి కనుక ఔషధం కొంచెం ఎక్కువ కాలం సేవించవలసి ఉంటుంది. ఔషధ సేవనం కొంత వెగటుగానే ఉంటుంది. ఇది ఏదో వేదాంతం కాదు. అద్వైతవాదం కాదు. ఏదో జటిల ధర్మ సిద్ధాంతం కాదు. మానవులలో సహజంగా ఉంది కరుణా భావం. ఆకారుణ్య భావాన్ని పెంపొందించుకుంటేనే కాని ఆధ్యాత్మిక జీవనం మాటలటుంచి, నైతిక సాంఘిక జీవనం సుఖ ప్రదంగా జరుగదు"

- (ఆచార్య వినోబాభావే) (ఆచార్యులు అస్పృశ్యత)

## అస్పృశ్యతను ఎదిరించిన కేరళ సంస్కర్త "నారాయణ గురు"

*(పి.సి.రాయ్ చౌదరి) 27-8-1969 (ఆంధ్ర జ్యోతి)*

"బృహత్తరమైన ఏ ఉద్యమం కేవలం ఒకరి కృషి వల్ల విజయవంతం కాదు. కవి శ్రీ నారాయణ గురు ఆశయం ఫలించింది. కవి శ్రీ "నారాయణ గురు" తన ఒకేమతం ఒకే దైవం ఒకే కులం అను సందేశంద్వారా అస్పృశ్యతా నివారణకు మార్గాన్ని సుగమం చేసి సాంఘిక అసమానత్వ నిర్మూలనంలో కృతకృత్యులైనారు॥

"స్వేచ్ఛ సమానత్వం, సౌభ్రాతృత్వాల కోసం మానవుడు, నిరంతరం పోరాడుతునే ఉన్నాడు అయినా మానవులలో ఒక వర్గం వీటిని పూర్తిగా అనుభవించలేక పోతుంది. మానవులు నిర్మించుకున్న మత ధర్మాలలో నూతనంగా ఆవిర్భవించిన నేటి అసహజ సిద్ధాంతాలలో ఈ లోపం ఇప్పటికే కొట్టవచ్చినట్లు కానవస్తోంది. తత్ఫలితంగా మానవుల మధ్య జనించిన నిమ్నోన్నతాభావాల జాడ్యం సమాజాన్ని పట్టి పీడుస్తుంది. ఇది ఒకచోట కులతత్వ రూపంలో స్వైర విహారం చేస్తుంది. మరోచోట వర్ణవిభేదం రూపంలో విలయ తాండవ మాడుతోంది. ఇంకొక చోట జాత్యహంకారం రూపంలో సమాజాన్ని సతమతం చేస్తుంది.

- అంటరానితనం - తెలుగు ఇస్లామిక పబ్లికేషన్సు) మహమ్మద్ అబీజు (రహ్మాన్)

## అర్చకులు

మైసూరు రాజ్యమందలి "మేలుకోట" వైష్ణవ దేవాలయమున సంక్రాంతి దినములలో మూడు నాళ్లు మాలవాండ్రు దేవునికి అర్చకులుగా నుండి బ్రాహ్మణులకు శఠగోపమును ప్రసాదమునిత్తురు.

*- (శ్రీదుగ్గిరాల వేంకటసూర్యప్రకాశరావుగారి యుపన్యాసం-మానవసేవ)*

## భగవద్గీత

**"విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని।**
**శుని చైవశ్వపాకేచ పండితా స్సమ దర్శినః॥"**

విద్యా విషయ సంపన్నుడగుబ్రాహ్మణుని యందును, గోవు నందును, ఏనుగునందును, కుక్కయందును, దానిమాంసము తినువాని యందును, పండితులు సమధర్మనులై యుందురు.

## భాగవతము

**శ్వపచోపి మహీ పాలవిష్ణు భక్తో ద్విజాధికః।**
**విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చ శ్వపచాధమః॥**

"శ్వపచుడైనను, విష్ణుభక్తుడైన ఎడల బ్రాహ్మణుని కన్న అధికు డగును. భక్తి లేని వాడు యతి యైనను శ్వపచుని కన్న నధముడగును."

**మేటి పల్నాటి వీర కిరీటమైన**
**బ్రహ్మ నాయడు గోసంగి పడుచు నందు**
**కొడుకులను గాంచడే తన కొలమునందు**
**వన్నె వాసియు నతనికి సన్నగిలెననె**

*- (వీర భాగవతం - శ్రీనాథుని పల్నాటి వీర చరిత్రం)*

"మున్ను యాగ క్రియా లోపమునను బ్రహ్మ
రాక్షసత్వంబు నొందిన బ్రాహ్మణునకు
కైశకీగీత మహిమ నక్కజము గాగ
మనుజరూపం బిడడె యొక్క మాలవాడు"

*- (ఆచార్య సూక్తి ముక్తావళి - తిరుప్పాణి యాళ్వారుచరితం)*

"హర్ష చక్రవర్తి కాలమున దివాకరుడను (మాతంగుడు) మాదిగ కులము వాడు గొప్ప కవియై యుండెను. ఆతని విద్యా మాహాత్మ్యమును గాంచి శ్రీహర్ష చక్రవర్తి యాతని బాణ మయూర మహా కవులతో సమానంగా తన సభయందు సభ్యునిగా నేర్పరచు కొనెను. అనగా మాతంగ దివాకరుండు శ్రీ హర్షు ఆస్థానకవి గానుండెను. రాజశేఖర కవి యిందును గూర్చి యిట్లు వ్రాసి యున్నాడు. తొలి పేజీలలో ఆవిషయం ప్రస్తావింపబడి యున్నది."

*- (నిరుద్ధభారతం) (శ్రీమంగిపూడి వేంకటశర్మ).*

## డా॥ అంబేద్కరు

"కులం పునాదుల మీద మీరు దేన్నీ నిర్మించలేరు. ఒక జాతినీ నిర్మించ లేరు. ఒక నీతిని నిర్మించలేరు. కులం పునాదులమీద మీరు ఏదైనా నిర్మిస్తే అది పగిలి ముక్కలు కావడం తప్పదు. అట్టి దేదీ ఒక సంపూర్ణ నిర్మాణంగా మనజాలదు. కుల నిర్మూలనకు సరైన పద్ధతి వర్ణాంతర వివాహాలేనని నా దృఢ విశ్వాసం. రక్త సమ్మిశ్రణ మొక్కటే మానవులలో, అన్యోన్య అనుబంధ భావాన్ని, బాంధవ్యాన్ని కల్గిస్తుంది. అట్టి బంధుభావ ప్రభావం లేనిదే, కులం కల్పించిన విభేదాలను వివక్షతలను రూపుమాపలేం. వివిధకులాల మధ్య స్నేహ సంబంధాలను కల్గించాలంటే ఆ యా కులాల మధ్య స్నేహ సంబంధాలను కల్గించాలంటే ఆ యా కులాల వ్యక్తుల నడుమ రక్త సంబంధాలను కల్పించక తప్పదు. కుల వ్యవస్థ రద్దు చేయడానికి సరైన మందు వర్ణాంతర వివాహాలే. మరొక టేదీ పనికి రాదు. కులం హిందువులకు ప్రాణ తుల్యం. దుష్టమైన ఈ కుల వ్యవస్థ ఒక్క

తమ హిందూ సమాజాన్ని కాక భారతీయ వాతావరణం మొత్తాన్ని కలుషితం చేసింది.

*- (దళిత జాతుల వైతాళికుడు - అంబేద్కర్ మండవ శివరామమూర్తి- పోలు సత్యనారాయణ)*

## కులభేదాలవల్ల

"The caste system was the major factor which was mainly responsible for inviting foreign rule in India because it created disunity, anti brother hood and non- coperation. People never thought in terms of nation hood. Indians never realised the value of unity and nationalism but always Jealously guarded the intrests of their own castes at cost of other castes. The brahmins always conspired with the ruling calsses against their own people for selfish reasons. The Priestly class never realised that their actions and preachings were anti-social, anti-national and anti-Brotherly.

... ... ....

The British Government opened the educational Institutions to the people of all castes. The Britishers never observed the caste rules in making recruitments of caders to the services or admitting students to the schools. and colleges. They gave Indians education new values and new standards. The oppressed masses of poeple realised the importance of all these which were once debarred to them. The sudras and the untouchables slowly realised the values of education. Property and self respect. British rule gave a new mode of Thinking a

new ideology and a new way of life to all those peoplewho were formerly deprived of all rights under the rule of caste - Councils i.e., caste panchayats. The British Government threw open the Hospitels to all Castes. Thousands of down trodden people embraced. Islam and Christianity in which they regained their self - respect and social status which were with held from them, because of their low caste and freed themselves from the octopus clutches of the Caste-system. In a word, the British rule immobilised the power of the caste-councils, and transferred it to the courts established by the Government. The British rule lent equality of status to all castes. Therefore, the untouchable breathed a sign of relief under the foreign rule. The foreign rulers didnot interfere with the caste system, as it was a boon to their stable administratioin."

"Gandhiji started his Harijan move-ment for the uplift of untrouchables but not to abolish the caste system. Gandhiji tried to eradicate untouchbility, while preserving the caste system. But Dr.Ambedkar strongly opposed the policy adopted by Gandhiji in the openion of Dr.Ambedkar, It is not only necessary to eradicate untouchbility but also to abolish caste-system it self which is the source of untouchbility, superiority and inferiority. The real method of breaking up the caste-system is not to bring about inter-caste dinners and inter caste marriaes but to destroy the religious notions on which the caste-system was founded".

*(Annihilation of caste by Dr. Ambedkar)*

*(The origin of caste-system and its rule in bringing foreign rule in India) S.S.Arakeri, M.A.,)*

"కులతత్వం భారతదేశంలో అనైక్యతను సౌభ్రాతృత్వ లేమిని సహాయ నిరాకరణను సృష్టించింది. వీటికి మూలాధారమైన ఈ కుల తత్వమే బారతదేశంలో విదేశీ పరిపాలనను ఆహ్వానించడానికి ప్రధాన కారణమైంది. భారతీయులు అప్పటిలో జాతీయతా భావంతో ఆలోచించలేదు. ప్రజల మధ్య సంఘీభావము, జాతీయతా భావముల విలువలను భారతీయులు గ్రహించలేదు. కొన్ని కులములను అణగ ద్రొక్కుటద్వారా ఇతర కులముల వారు వారి స్వార్థ పూరిత అగ్ర కుల వ్యవస్థను పరిరక్షించు కోడానికి కృషి చేసారు. బ్రాహ్మణులు పరిపాలకులతో చేతులు కలిపి వారి స్వార్థం కోసం స్వదేశీయలకు వ్యతిరేకంగా కుట్ర చేసారు. ఈ పూజారి వర్గమువారి చేతలు ఉపదేశాలు సంఘవ్యతిరేకమని, జాతి వ్యతిరేకమని సౌభ్రాతృత్వానికి గొడ్డలి పెట్టని, వారు గ్రహించలేదు. బ్రిటిషు ప్రభుత్వము వారు భారత దేశంలోని అన్ని కులముల వారికి విద్యాసంస్థలను ప్రారంభించారు. వారు భారతీయులను ఉద్యోగ నియామక సందర్భములలో గాని, పాఠశాలలలోను కళాశాలలలోను విద్యార్థులను చేర్చుకొను విషయములలో గాని కులవివక్షత చూపలేదు. వారు భారతీయులకు విద్యను నూతన విలువలను, నూతన స్థాయనీ ఏర్పాటు చేసారు. ఇట్టి వ్యవస్థనుండి నెట్టి వేయబడి తరతరాలుగా అణగద్రొక్కబడిన దళితులు ఈ నూతన వ్యవస్థ యొక్క ప్రాముఖ్యతను గ్రహించారు. క్రమేణా శూద్రులు, అంటరానివారు విద్య, ఆర్థిక పరిపుష్టి, స్వాభిమానముల యొక్క విలువలను గ్రహించ సాగారు. నూతన ఆలోచనా ధోరణిని, నూతన ఆదర్శములను, నవ జీవన విధానమును, కుల వ్యవస్థకు బలియై మానవ హక్కులను పోగొట్టు కొనిన నిమ్నజాతుల వారికి బ్రిటిషువారు అందుబాటులో ఉంచారు. కుల రక్కసి కోరలలో బంధింపబడి, అణగద్రొక్కబడి, స్వాభిమానమును, సంఘములో వ్యక్తి హోదాను పొగొట్టుకొనిన వేలాది మంది దళితులు నిమ్న జాతుల వారు ఇస్లామ్ మతమును క్రైస్తవ మతమును స్వీకరించి, వారు కోల్పోయిన స్వాభిమానమును వ్యక్తి గౌరమును తిరిగి పొంద గలిగారు. బ్రిటిష్ ప్రభుత్వము వారు కుల సంఘముల యొక్క అధికారమును నిర్వీర్యం చేసి, దానిని ప్రభుత్వము ఏర్పాటు చేసిన న్యాయస్థానాలకు బదిలీ చేసారు. సమాజంలో అన్ని కులముల వారికి సమాన హోదాను బ్రిటిష్ ప్రభుత్వం కల్పించింది, అందువలన అంటరాని

వారు విదేశీ పరిపాలనలో కొంతమట్టుకు కులవ్యవస్థ నుండి బయట బడి కొంచెం ఊపిరి పీల్చుకో గలిగారు. విదేశీయులకు వారి పరిపాలనను సుస్థిరము చేసికొనుటకు, కులవ్యవస్థలో వారు జోక్యం జేసుకోలేదు. గాంధీగారు అంటరాని వారిని ఉద్ధరించుటకే ఉద్యమమును నడిపించారు. గాని కులవ్యవస్థను నిర్మూలించుటకు కాదు. ఒక ప్రక్క అంటరాని తనమును నిరసిస్తూ, మరియొక ప్రక్క కులవ్యవస్థను పరిరక్షించడానికి గాంధీ గారు ప్రయత్నం జేసారు. కాని, డాక్టరు అంబేద్కరు గారు గాంధీగారి కుటిల ద్వంద్వ నీతిని తీవ్రంగా వ్యతిరేకించారు డాక్టరు అంబేద్కరు గారి అభిప్రాయంలో, అంటరాని తనమును నిర్మూలించటయే గాక, ఈ అంటరాని తనమునకు అగ్రజాతులు, నిమ్నజాతులు అనే భావ సాంప్రదాయానికి మూల కారణమైన కులవ్యవస్థను, సాంద్రాయాన్నీ కూడా నిర్మూలించాలి. ఈ కుల వ్యవస్థను సమూలంగా త్రుంచి వేయుటకు సహపంక్తి భోజనాలు, వర్ణాంతర వివాహాలూ, సరియైన మార్గములుకావు. ఏ మతాచారముల మీద ఈ కుల వ్యవస్థ నిర్మింపబడిందో ఆ మతాన్ని సమూలంగా నిర్మూలించడమే సరియైన పద్ధతి.

## డాక్టరు రామ మనోహర్ లోహియా (కులాల సమస్య)

"విత్తనము అంకురించినప్పుడు రైతులకు ఆనందము కలిగినట్లుగా, శూద్రుల్లో హరిజనుల్లో స్త్రీలలో నిద్రాణమై యున్నటువంటి శక్తి జాగృతమైనప్పుడు ఆనందం కలుగుతుంది. అదేవిధంగా శ్రద్ధా ప్రయత్నాల ద్వారా దాన్ని వికసింపజేయడానికి కృషి జరిగే వరకూ భారతదేశంలో ఏ వాదమైనా సరే నూతన జీవశక్తిని చెయ్యలేదు."

"వర్గాలూ కులాల ఎగుడు దిగుళ్ళు కొనసాగుతూనే ఉండటం చరిత్ర నియమం. భారత దేశ చరిత్రలో 11 వందల సంవత్సరాల పాటు చరిత్ర జడంగా ఉండి పోయింది. శంకరా చార్యుని కాలం నుంచి దీని మీద రెండు దాడులు జరిగాయి. బ్రహ్మ సూచికలు లేదా అగ్ని సూచికులు ఉపనిషత్తుల ద్వారా జరిపిన దాడి ఒకటి. కులం అనేది మహా పాపమనీ, దాన్ని శాశ్వతంగా అంతమొందించే మార్గాలను అన్వేషించాలని" వీరు పేర్కొన్నారు.

"ముస్లిముల కాలంలో సిద్ధాంతాల వ్యాప్తి ఉదారంగా సాగి శూద్రులు పురోగమించడానికి అవకాశం లభించింది. మత పరివర్తనాల ద్వారానే అయివుండుగాక! ముస్లిం మతా వలంబనం వలన శూద్రులలో సాంఘిక సమానత్వం, ఎక్కువ తక్కువలకు వ్యతిరేకంగా తిరుగుబాటు భావన అయినా జాగృతమైంది. కబీర్, దాదూ, రవిదాస్, గోరా,నామ్‌దేవ్, చోఖా మొదలైన సంత్‌ల రూపంలో దాని ప్రతి క్రియ ప్రకటితమైంది. ఇదే విధంగా ఆంగ్లేయ కాలపు బానిస యుగం, శూద్రుల విషయములో వరంగా పరిణమించిందని, నేను బల్లగ్రుద్ది చెప్పగలను. పురాతన గణరాజ్యాల గురించి మనం ఎన్ని గొప్పలు చెప్పుకొన్నప్పటికీ ఆంగ్లేయుల సంపర్కమే లేకపోయినట్లయితే మనం చాల వెనకబడి ఉండేవాళ్లం.

భారతదేశ చరిత్రలో 5 వేల సంవత్సరాల కాలంలో శూద్రులలో నుంచి ఒక్క విద్వాంసుడు కూడా జన్మించ లేకపోయాడు. కాని ఆంగ్లేయుల బానిసయుగం డాక్టర్ అంబేత్కర్, మేఘనాథ్‌సాహా, రాధావినోదపాల్, సురేంద్రనాథ్‌పాల్ వంటి అనేకమంది విద్వాంసులను రూపొందించింది. ఇక్కడ. శూద్రులంటే స్పృశ్యాస్పృశ్యులైన ఉభయరకాల శూద్రులనేదే మా అభిప్రాయం.

## భారతీయ తత్వశాస్త్రము (ఏటుకూరి బలరామమూర్తి)

"వర్ణ వ్యవస్థ, భారతదేశంలో బానిస వ్యవస్థ యొక్క ప్రత్యేక రూపం. అధర్వణ వేదకాలం నాటికి నాలుగు వర్ణాలు ఏర్పడ్డాయి ద్విజులకు మాత్రమే వేదాధ్యయన అర్హత అన్నారు. శూద్రులకు విద్య అక్కరలేదు కూడదు. అంధప్రాయంగా ద్విజులకు సేవచేయటయే వారివిధి. ఆలోచన వారిలో రేకెత్త రాదు.

వేదాల చుట్టూ ఈ గిరిగీయటం భారతీయ తాత్విక రంగంలో, పాలక వర్గాల ప్రప్రథమ జోక్యానికి చిహ్నం. వేదాలు అందరూ చదివితే ఏమి? వాటిలోని అర్థాన్ని అందరూ గ్రహిస్తారు. విమర్శనా ధోరణి కలుగుతుంది. హేతువాదం ఏర్పడుతుంది. హేతు వాదము విశ్వాసానికి శత్రువు. వర్ణదోపిడీని వర్గదోపిడీ సమర్థించే అంశాల పట్ల అసంతృప్తి వ్యతిరేకత తలెత్తుతాయి. వర్ణ వ్యవస్థ బీటలు వారుతుంది. ధర్మం నాలుగు పాదాలలో ఎలా నడుస్తుంది? నాలుగు పాదాలలో నడవడమంటే ఏవర్ణంవారు ఆవర్ణానికి కేటాయించిన పదవిని తలవంచుకొని చేయటం. ఇందుకు వ్యతిరేకమైన ప్రతిదీవర్ణ సంకరమే.

## దళిత జాతుల వైతాళికుడు - అంబేడ్కరు

"హిందూమతం బౌద్ధంమీద విజయం సాధించాక కూడా దళిత ప్రజలు హిందూమతంలోకి రాకపోవడం వల్ల హిందువులు వాళ్ల మీద అస్పృశ్యతా కళంకం రుద్దారు. దళిత ప్రజలు అస్పృశ్యులు కావటానికి బౌద్ధ-బ్రాహ్మణ మతాలమధ్య వున్న ద్వేషాలను ప్రధానకారణంగా తీసికోగలమా? అనే ప్రశ్న తలెత్తవచ్చు. ఈ ప్రశ్నకు సమాధానము అంబేడ్కరే చెప్పారు. కేవలం బౌద్ధ మతావలంబనమే గాక యితర పరిస్థితులు కూడా దళిత జాతులను అస్పృశ్యులు గా చేసినట్లు అంబేడ్కరు నిరూపించారు. అంబేడ్కరు పరిశోధనల ఫలితంగా అస్పృశ్యత రమారమి క్రీస్తుశకం 400 నుంచి మొదలైందని అంబేడ్కరు భావించాడు".

### ద్రవిఢకజగం వృద్ధనాయకులు శ్రీ ఇ.వి.రామస్వామి నాయకర్ అభిప్రాయం

"నా ప్రధానమైన పోరాటం కులవ్యవస్థ పైన. ఆయన ఉద్యమం కేవలం కులచిహ్నాలకు వ్యతిరేకం. వ్యక్తిగత హింసవల్ల పరస్పరం నాశనమౌతామాని తాముభావిస్తున్నట్లు శ్రీనాయకర్ నాతో అన్నారు." రామమనోహభర్ లోహియా.

*(కులాలసమస్య - డా॥ రామమనోహర్‌లోహియా)*

## డాక్టరు అంబేడ్కరు - వర్ణ భేదము

మన రాజకీయములపై కులముల కుండు ప్రభావము స్వల్పమని భావింపరాదు. రాజకీయ విప్లవమునకు ముందు ఎప్పుడును కూడ సాంఘిక మత విప్లవములే జరుగు చుండెనని చరిత్ర నిరూపించుచున్నది. లూథర్ తీసికొని వచ్చిన సాంఘిక విప్లవము ఐరోపా వారిలో రాజకీయోద్ధరణమునకు దారితీసెను. ఇంగ్లీషువారితో ప్యూరిటానిజం రాజకీయ స్వాతంత్ర్యమునకు కారణ భూతమయ్యెను. అది నూతన జగత్తునకు పునాది వేసినది. అదియే అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధమున జయించెను. అసలీ ప్యూరిటానిజ మొక ధార్మికోద్యమమై యున్నది. ఈ సిద్ధాంతం ముస్లిం రాజ్యమునకు గూడ వర్తించును. అరబ్బులందు రాజకీయ శక్తి ఉద్భవిల్లుటకు పూర్వము హజరత్ మహమద్‌వారిలో

ధార్మికవిప్లవమును లేవదీసెను- భారతదేశ చరిత్రయు నిందులకు నిదర్శన మిచ్చుచున్నది. చంద్రగుప్త మౌర్యునిచే నడుపబడిన రాజకీయ విప్లవమునకు చాల కాలము క్రిందటనే బుద్ధ భగవానుడు ధార్మిక సామాజిక విప్లవమును లేవదీసి యుండెను. మహారాష్ట్ర దేశములో గురువులు, సాధువులు, ధార్మిక సామాజిక విప్లవముల దెచ్చిన యనంతరమే శివాజీ రాజకీయ విప్లవమును తేగలిగెను, సిక్కులలో గల రాజకీయ చైతన్యమునకు పూర్వమును నానక్ గురువు సామాజిక ధార్మిక విప్లవమును తెచ్చియుండెను. ఇంకను ఉదాహరింపవలసిన అవసరంలేదు. ప్రతి జాతి యొక్క రాజకీయాభివృద్ధికి పూర్వము దాని యాత్మ, బుద్ధి పునరుద్ధరింప బడుట పరమావశ్యకము "సత్యసూత్రరత్నాలు" (ఆంధ్రప్రదేశ రాష్ట్ర హరిజన మహాసభ ప్రత్యేక సంచిక, 2-4-76)

"హరిజనుడు బాహిరజనుడుగా ఉండే దుర్దినాలు చెల్లి పోయి పురజనుడుగా పరువుగా, బతుకుతూ భూచక్రాన్ని త్రిప్పే తరుణమిది. 'ఔను' హరిజనుడు ఆ చక్రధరుని సంతతేకదా! తిప్పుకుంటాడా చక్రాన్ని తీర్చిదిద్దుకుంటాడా జాతి భవితవ్యాన్ని".

-డాక్టర్. సి. నారాయణరెడ్డి

**"యువకు లార లెండు! యువతులారా! రండు!**
**కుల మతాల గోడ కూల ద్రోయ,**
**ప్రతిన బూనుడోయి। భరత సంతతిలోన**
**హెచ్చు లొచ్చు లుండనీయ మనుచు!!**

- డాక్టర్. దాశరథి

**"కరుణగలచోట నాగీము కట్టినాడ**
**ప్రేమతత్త్వంపు పంచలో పెరిగినాడ**
**జాలి గుండెలు గల చోట వ్రాలినాడ"**

- నూతక్కి అబ్రహాం

## యుగ యుగాల అభ్యుదయ పథంలో హరిజనులు

- డా॥ యస్. టి. జ్ఞానానందకవి

"Arise awake, and stopnot till the goal is reached Arise a wake, awake from this hypnotism of weakness none is really weak The Soul is infinite, Omnipotent, Omniscient stand up, assert yourself, proclaim the God with inyou, don't deny him"

"లెమ్ము మేల్కొమ్ము గమ్యం చేరువరకు నిలవకుము
లెమ్ము ఈ దుర్బలత్వమును మైకంనుండి మేల్కొంచుము
ప్రపంచంలో ఎవరును దుర్బలురుకారు. ఆత్మ అనంతం
సర్వశక్తియుతం సర్వజ్ఞం అయియున్నది. కాబట్టి లెమ్ము
నీ ఆత్మ శక్తిని ప్రకటింపుము. నీలో నున్న దైవమును చాటుము.
ఆతని నెన్నడును తిరస్కరింపకుము"

"ఎవడు సృష్టించినాడొ? యస్పృశ్య జాతి
కలదె? వానికి శాంతి స్వర్గమున నేడు
ఎంద ఔందఱు చితి కెక్కి యేడ్చినారొ?
ఇంక నెందఱు చితి కెక్కి యేడ్తురొక్కొ?"

హిందూదేశానికి తీరని కళంకంగా వీడని నీడలా మాయని మచ్చలా, యుగయుగాల నుంచి వస్తున్న ఈ అస్పృశ్యతను గుఱించి మహర్షులు, మేధావులు, రాజకీయనాయకులు మొదలగు వారెందరో తమ తమనిశిత అభిప్రాయాలను నిష్కర్షగా, నిర్మొహమాటంగా చెప్పారు. కాని అస్పృశ్యత మాత్రం అలాగే నిలద్రొక్కుకొని, వేళ్లూని పాతుకుపోయింది. మహావటవృక్షంలా! దీన్ని ఛేదించాలని ప్రయత్నాలు జరిగాయి. పాలన సముద్ర మథనంలో హాలాహలం తర్వాత నైనా అమృతం ఆవిర్భవించింది గాని ఈ అస్పృశ్యతా నివారణ మథనంలో అమృతం

పుట్టలేదుగదా విషగరళమే అధికమయిందన్న అభిప్రాయంరావటం నిజమేకాని అది అంత యథార్థమైన విషయంగాదని మాత్రం అంతాయెరిగినదే. ప్రతి యుగంలోను ఎవరో ఒక సంఘసంస్కర్త, ఒక మహానాయకుడు ప్రభవిస్తూ, ఈ అస్పృశ్యతా జాడ్యానికి ఔషధమీయాలని ప్రయత్నించినవారే, రోమునగరం ఒక రోజులో నిర్మించటం సంభవంకానట్లే, ఒకేసారి ఈ అస్పృశ్యత తొలగిపోవటానికి అవకాశంకలగడంలేకపోయింది. (కలుగదుకూడా)

**"విడిచిరే యత్నమమృతంబు వొడముదనుక**

**నిశ్చితార్థంబు వదలరు నిపుణమతులు"**

అన్న సూత్రం ప్రకారం ఎందరో మహానుభావులు ధ్వనించి దుర్వార భయంకరమైన ఈ అస్పృశ్యతా మహాపైశాచికీ దంష్ట్రాల్ని ఊడగొడుతున్నారు. సృష్ట్యారంభమున జగత్తునకు నామ రూపాలులేవు. ఆతరువాత క్రమంగా యుగవిధానము కృతాది యుగధర్మములు నిర్ధారింపబడినవి.

**"అంత్య జాతిః ద్విజాతి శ్చ ఏక ఏవ సహోదరాః**

**ఏక యోని ప్రసూతత్వాత్ ఏక శాఖే న జాయతే"**

మనుజులందరు మను బ్రహ్మకు పుట్టినందున ఏకజాతి సహోదరులే యగుచున్నారు.

**"మనోర్జాతాః మనుజాః మనుష్యాః"**

సర్వ వర్ణములును మానవులే యగుటచేత సహోదరులే యగుచున్నారు నేటి మానవ సమాజ మెంతవరకు నీసూత్రముల నంగీకరించి యాచరణలో పెట్టుచున్నది. సముద్రములో నీటి బొట్టు. పూర్వకాలమున ద్విజులు కాని వారనేకులు బ్రాహ్మణత్వమును పొందినారు. వారి జన్మ విధమెద్ది యైనను, వారందరు తమ తపోబలసంపద వలన ద్విజత్వం పొందినారనుటలో సందేహమేమియులేదు. ఇచ్చట జాతితో నేమియు సంబంధము లేదు.

"వ్యాస మునిచంద్రుడన్న పరాశరుండు
మాల దానికి బుట్టి బ్రహ్మర్షి యయ్యె
వేశ్యకును బుట్టి మాలెత పెండ్లియాడి
యా వసిష్ఠ మహర్షి బ్రహ్మర్షి యయ్యె

వ్యాసముని చంద్రుని కనిన పరాశరుడు మాలెతకు జన్మించి బ్రహ్మర్షి యయ్యెను, భోగపు కాంతకు బుట్టి మాలెతను పెండ్లి యాడిన వసిష్ఠ మహర్షి బ్రహ్మర్షి అయ్యెను. వేదవ్యాసున కుద్భవించి దివ్యజ్ఞాన సంపన్నుడయిన శుకమహర్షి ధన్యుడయ్యెను ఈ చర్చ శాంతి పర్వము దేవీభాగవతము ప్రథమస్కంధమున గన్పట్టును. మనువు కూడ తప స్సంపన్నత్వమువలన పూర్వము ద్విజులయినారని వచించినాడు.

జాబాలునికొడుకు సత్యకాముడు తన సత్యసద్గుణాలవలన గౌతముడు బ్రాహ్మణ జాతిలో చేర్చగా దాని కెల్ల భూసురులు తమసమ్మతిని దెపినారు.

"అస్తువేదవిశ్వాస రహితో ధర్మ పరాఙ్మఖం తన్న నుష్ఠతి
సజన్మనా బ్రాహ్మణోపి కర్మచండాలో భవత్.
(విద్యారణ్యుడు)
ఋష్యశృంగుడు లేడికి
కౌశికుడు దర్భకు
వాల్మీకి పుట్టకు
వసిష్ఠుడు ఊర్వశికి
అగస్త్యుడు కుండకు
గౌతముడు చెవులపిల్లికి
మండూకముని కప్పకు

శుకమహాముని చిలుకకు..........పుట్టినను తపస్సిద్ధి వలన వీరందరు బ్రాహ్మణత్వము పొందినారు. నిజమును పరిశీలించితిమేని జాతివలన వీరందరు

బ్రాహ్మణులు కానేరరు. మునిలోకచంద్రుడయిన వసిష్ఠుని యర్థాంగ లక్ష్మి మాతంగకులానకు చెందలేదా?

బ్రాహ్మణులులేని యొకానొక దేశమున భార్గవరాముడు బెస్తవారికి జందెములు వేసి బ్రాహ్మణులుగా జేయలేదా? (స్కాందపురాణము - సహ్యాద్రి ఖండంలో)

ఈ తీరుగా చెప్పికొనవలసి వచ్చినచో కులాల వ్యవస్థ పూర్వ ఎలాగున నుండెడివో తెలియగలదు.

ఆలోచించిన యథార్థమునకీ పంచమజాతివారే ప్రాచీన భారత దేశానకు ప్రభువులై, రాజులై, ఋషి చంద్రులై, వేదాంత వేద్యులై యున్నట్లు మన దేశ చారిత్రక గ్రంథములు ఋజువు చేయుచున్నవి. జాతీయ సమైక్యభావనకు ఈ వర్ణవ్యవస్థ గొడ్డలి పెట్టువంటిదయినది. మానవులందరూ ఒకటేనని చెప్పే అవసరం ప్రతిభావంతుల వంతు వచ్చింది. వారు చెప్పక తప్పలేదు. ఈ అంటరానితనం దేశానికే మహావ్రణమని భూతమని, జాడ్యమని, ఘోరకృత్యమని వేరు పురుగని చెప్పవలసి వచ్చినది.

వేదకాలంలో కుల సమస్యే లేదు

బ్రాహ్మణములో వర్ణవ్యత్యాస వ్యవస్థ ప్రతిపాదన ఉపనిషత్తులలో దీనికి వ్యతిరేకము. వర్ణాలుండాలని మనువు శాసించాడు.

బుద్ధుడు, జిన, రామానుజాచార్యులు, కల్యాణబసవేశ్వరుడు బ్రహ్మనాయుడు దయానందుడు, వివేకానందుడు, చైతన్యుడు. ఏకనాథుడు, నారాయణగురువు, గాంధీజీ, బ్రహ్మర్షి రఘుపతి వేంకటరత్నంనాయడు పిఠాపురం మహారాజు ప్రభృతి వరులు ఆదిమాంధ్రుల హృదంతరాళంలో ధ్వనింపగల మహామానవతా వాదులు మహాపురుషులు కూడాను.

**"యథాకృతయుగే పూర్వమేక వర్ణమ భూత్కిల**
**తథాకలియుగ స్యాంతే శూద్రభూతాః ప్రజాస్తథా॥**
**"నవిశేషోఽస్తివర్ణానాంసర్వం బ్రాహ్మణమిదం జగత్**
**బ్రాహ్మణా పూర్వసృష్టంహి కర్మాభిర్వర్ణతాంగతః"**

వర్ణములలో విశేషమేమియులేదు ఈ ప్రపంచముంతయు పూర్వకాలమందు బ్రహ్మమయం గానే సృష్టింపబడి.కర్మచేత వర్ణత్వం బొందినది. ఈ కుల వ్యవస్థ వలన దేశమెంత అథోగతి పాలయినదో, చారిత్రకులు దేశనాయకు లూహించక లేకపోలేదు జాతీయ సమైక్య మొకవంక నష్టపడి యితర దేశాల వారికి దాస్యం చేయవలసిన స్థితికి దిగజారటం వలన ఎంత అనర్థం ఉందో ఊహింపగలం.

"The caste system was the major factor which was mainly responsible for inviting foreign rule in India, because it created disunity anti-brother hood and non- co-operation. people never thought interms of nationalhood. Indians never realised the value of unity and nationalism but always jealously guarded the intrests of their own castes at cost of other castes. The Priestly Class never relaised that their actions and preachings were anit-social, anti-national and anti-brotherly.

- *(S.S.Arakeri)*

మహోన్నత జాతిగా రూపొందించవలసిన భారత దేశజాతీయతకెంత భంగము వాటిల్లుచున్నదో యీకులవ్యవస్థ వలన తెలియుచున్నది.

గాంధీ, నెహ్రూ, లాల్‌బహుదూర్, టాగూరు, తిలక్, గోఖ్లే, లాలాలజపతిరాయ్, వినోబాభావే, రాధాకృష్ణ మున్నగు భారత నాయకులెంతగా మధనపడినారో గమనార్హం. ఒకనాడు ముష్కరంగా మున్మరంగా మూఢంగా నున్న ఈ వర్ణ వ్యత్యాసం త్యాగధనుల సత్కార్యాచరణమువలన కొంత యిప్పటికే సడలినది. పూర్తిగా సడలిపోయే కాలంకోసం ఆశించటంలో అవాస్తవికత ఏమీలేదు.

నేటి యుగంలో హరిజనోద్ధరణ సమగ్రకార్య రంగంలో గాంధీమహాత్ముని అవ్యాజవాత్సల్యం అకుంఠిత దీక్షా దక్షత, పతిత జనోద్ధారకుడు డాక్టరు అంబేద్కరు మహాశయుని అశేష కృషి, శేముషీ సేవా కార్య కలాపాలు యుగయుగాల నుండి అథోజగత్తులో మ్రగ్గిపోయిన నిరాధారులకీ నాడు అభ్యుదయ చైతన్య వికాసము లభిస్తుందంటే, ప్రభుత్వం మహా తీవ్రతర కృషి ఫలితమని చెప్పవలయును.

చదువు సందెకు

తిండికి తిప్పకు

గుడ్డకు గూడుకు

కోటాను కోట్ల హరిజనులకు సౌకర్యాలు కల్పించటం అభ్యుదయానికి వీలయినంతవరకు మార్గాన్ని సుగమం చేయటం తన విధ్యుక్త ధర్మంగా ప్రభుత్వం భావించి అవిరళకృషి చేస్తుంది. ఇరువది ఆర్థిక సూత్రాల ఫలితం హరిజనావళికి ఏడుగడ అయినది. ఇంద్ర చాపమయినది. ఎదురులేని ఆత్మవిశ్వాసానికి అభ్యున్నతికి ఆలోచనా సరళికి మార్గాన్ని కల్పించినది. కల్పతరువయినది. నేడు దేశ సౌభాగ్య సౌధ శిఖరారోహణం గావిస్తున్న హరిజనులకు, గావింపబడుచున్న సౌకర్యాలు యుగయుగాల అభ్యుదయపథంలో, హరిజనుల పరిణామ దశకు చిహ్నామనుటలో సందేహంలేదు.

## "హరిజనులు నాడు-నేడు

*- (డా॥ నంబూరి దూర్వాసమహర్షి)*

"అస్పృశ్యులన బడు ఒక ప్రత్యేక తెగ ఈదేశమునందు ఏర్పడుటకు మూల కారణము ఆర్యుల యొక్క జాత్యహంకార స్వార్థ చింతనములే తప్ప వర్ణ సాంకర్యము జరిగినందువలనే అనుట సత్యేతరమైన సంగతి.

ప్రాచీన భారతజాతి అయిన ద్రావిడులపై దండయాత్రలు సాగించి కుట్రలతో కూహకాలతో విజయము గాంచిన ఆర్యులు తమ యొక్క అల్ప సంఖ్యాక నిరంకుశ పరిపాలనాధికారము అధిక సంఖ్యాకులైన పరాజిత ద్రావిడ ప్రజానీకముపై శాశ్వతకాలము సాగుటకు గాను దుర్బుద్ధితో దుష్ట చింతనతో వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ పేర ఒక దుష్టమయిన నూతన సాంఘిక వ్యవస్థను రూపొందించినారు. దీని ప్రచారము పరాజిత ద్రావిడ సమాజమంతయు ఎటువంటి సాంఘిక, ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక హక్కులు లేకుండా నాలుగో వర్ణముగా అనగా శూద్రవర్గముగా స్థిరపడి పై మూడు వర్ణములవారికి అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులుగా తమలో తాము విభాగములొందిన ఆర్యులకు సేవా కార్యక్రమములు జరుపుతూ మాత్రమే జీవించవలసి వుంటుంది.

ఈ దుష్ట పద్ధతికి తలవంచిన పరాజిత ప్రజలలో కొంత భాగము శూద్రవర్గంగా స్థిరపడినది. అయితే శాశ్వత బానిస జీవిత విధానము నకు హేతుభూతమైన ఈ దుష్టసాంఘిక వర్ణ వ్యవస్థా విధానము పరాజిత ప్రజల యందు అధికాంశమునకు సమ్మతికాలేదు. అంతవరకు స్వేచ్ఛాజీవులుగా స్వతంత్ర పౌరులుగా సర్వసత్తాక ప్రతిపత్తి గల ఒక మహోన్నత జాతిగా మనుగడ సాగించి మహోన్నతమైన నాగరకతా సంస్కృతులకు వారసులై వేల సంవత్సరములకు పూర్వమే "హరప్పా", "మొహంజదారో" వంటి మహానగరముల నిర్మాణ దక్షులయినవారు పొట్టకూటికి బానిసలై పరాయి పాలకుల అడుగులకు మడుగులొత్తు వర్ణ వ్యవస్థలో అట్టడుగపడియుండుటకు ఒప్పుకొనలేకపోయినారు. పర్యవసానముగా వారు పర్వత ప్రాంతములకు మహారణ్య మధ్యప్రదేశములకు వలస పోయినారు. తదాదిగా పదులు, వందల సంవత్సరముల కాలము వారు ఆర్యులతో ప్రచ్ఛన్నము గను బహిరంగముగను పోరాటము సలిపినారు. ఆర్యుల యొక్క వర్ణవ్యవస్థకు వ్యతిరేకముగాను వారి యొక్క జీవహింసా పూరితమైన కర్మకాండాదికమునకు విరుద్ధముగను సమయానుకూలముగా పోరాట కార్యక్రమాలను నిర్వహించినారు. అందుచేతనే ఆర్యులు వారిని దస్యులని దాస్యులని రాత్రించరులని, తుదకు రాక్షసులని కూడా పిలవడం జరిగినది.

ఈ విధముగా ఆర్యుల యొక్క వర్ణ వ్యవస్థా విధానమునకు వారి నిరంకుశాధికారమునకు వ్యతిరేకముగా పోరాటము సలిపి విజయావకాశములు కానరాక విధి వంచితులై ఆర్య పాలకులకు లొంగిపోయిన చిట్టచివరి పరాజిత ద్రావిడ ప్రజా సముదాయమే ఆర్యులచేత అస్పృశ్యులుగా సంఘ బాహ్యులుగా అంతే వాసులు గా చేయబడినారు. ఇట్టి వీరోచిత ద్రావిడ ప్రజానీకమునకు చెందినవారసులే నేటి హరిజనులు. ఆర్య సంఘము నిర్దాక్షిణ్యముగా వీరి బ్రతుకులపై పులిమిన అస్పృశ్యతా పంకిలమును ప్రక్షాళనము ఒనరించి భారత సహజమున సముచిత స్థానమును కల్పించుటకువిశేష కృషిని సలిపినావారు గౌతమబుద్ధుడు, రామానుజుడు, బసవేశ్వరుడు, చక్రధరుడు, చైతన్యుడు, ఏకనాథుడు, రామానందుడు, కబీరు, తుకారాం, రోహిదాసు, చోకామేళుడు, వీరబ్రహ్మేంద్ర స్వామి మొదలగు మహాపురుషులు అనేకులు.

- *(ఆంధ్రప్రదేశ్ హరిజన మహాసభ ప్రత్యేక సంచిక)*

## అమరావతీ మహా స్తూపమునకు చర్మకారుడొనర్చిన దానము

- *(కార్తికేయ శర్మ)*

ఆచార్య నాగార్జునుని ప్రాభవమునకు పరవశులైన సాతవాహన చక్రవర్తులు ఈ స్తూపమునకు పెద్ద శిల్ప కళావేదికను అమర్చినట్లుకూడా తెలియుచున్నది. ఈ మహత్తర పూర్ణ ఘట పటము దాచేపల్లి ముగ్గు రాయితో చేయబడినది. 4' × 2'' × 3' కొలతలు గలది. ఈ చిత్రము క్రిందనే శాసనము కూడా గలదు. క్రీ॥శ॥ 2 - 3వ శతాబ్దికి చెందినట్టిది. ఈ పటమును మొట్టమొదట బర్గెసా 1881 లో కనుగొన్నాడు. "హుకట్స్'' పండితుడు ప్రచురించెను.

### వరుస - 1:

" సిద్ధంచయ కారస నాగ ఘరియపు తన విధికస
సంఘ తుకస సభయకస సభాతుకస పుతసచ నాగస
సమధు తకస సనతిమితా బంధవస దేయదం మ"

### వరుస - 2 : పుణఘటకపచో.,

### ఈ ప్రాకృత శాసనానికి అర్థము:

సిద్ధం గృహపతి నాగునికొడుకు - చర్మకారుడు విధిక - తన తల్లి, భార్య, తమ్ముళ్లు, కొడుకు నాగుడు, కూతుళ్లు, దాయాదులు, స్నేహితులు, - బంధు వర్గముల దేయ ధర్మమునకు గాను ఈ పూర్ణ ఘట పటమును. (గావించెను)

ఈ పూర్ణఘట శిల్పము విలక్షణమైనదే గాక అమరావతీ శిల్ప సంపదక శోభస్కరమై "ఆంధ్రుల ప్రాచీన శిల్ప శైలి'' సర్వ మంగళకరముగా నిలిచినది ఆంధ్ర దేశము యొక్క సహజ ప్రకృతి సంపద సౌందర్యములకు దీపికయై మన రాష్ట్ర ప్రభుత్వ చిహ్నమున ముఖ్యాంకమై చిరస్థాయిగా నుండిపోయినదీ పూర్ణకుంభము. ఈవిధముగానైన మనకు తెలియకనే ఈ చర్మకారుడు విధికను, తాను గావించిన కృతమును గౌరవించితిమి.

ఈ చర్మకారుడు అతి సామాన్యుడు, సాతవాహన ఇక్ష్వాకు కాలమువాడైన ధన్యుడు మనకు చిరంజీవి యైనాడు.

అమరావతీ శిల్పములపై నున్న పెక్కు దాన శాసనముల పరిశీలించిన, ఒక శిల్పస్తంభమును పశువుల కాపరి దానము చేసెను. ఇంతటి విశిష్టమైన సామాజిక-మత సమతా విధానమునకు ఆచార్య నాగార్జునుడు కారణము.

## సంగీతము - హరిజనులు

*- (పాలగుమ్మి విశ్వనాథం)*

*(ఆంధ్రప్రదేశ రాష్ట్ర హరిజన మహాసభ ప్రత్యేక సంచిక)*

"కళా సృష్టిగాని కళాకౌశలంగాని ఏ ఒక్కకులానికీ పరిమితమై లేదు. అనుభవించే మనుస్సు అందరికీ ఉంటుంది. భావోద్వేగం, ఏ ఒక్కరి సొత్తు గాదు. హరిజనులు పల్లెవాసులు కాబట్టి కాయకష్టం చేసి బ్రతికేవారు కాబట్టి జానపద రీతుల్లో వారి కళా కౌశలం పరవళ్లు త్రొక్కింది. డప్పు వాయిద్యం లో ప్రావీణ్యము గణించిన వారు వీరిలో ఉన్నారు.

## "అమృతయ్య", "జేసుదాసు"

అనేవారిద్దరు డప్పువాయిస్తూంటే చూసి తీరాల్సిందే. రకరకాల తాళాల్లో, రకరకాల గతుల్లో చిందులు త్రొక్కుతూ వారు డప్పు వాయిస్తుంటే చుట్టూ ఉన్నవారంతా దానితో లయకలిపి అడుగు వేయవలసిందే. ఆంధ్రదేశంలో డప్పువాయిద్యం ఒక ప్రత్యేకత గడించుకొంది. జాన పద వాద్యాలలోనూ, జానపద. గాయకులలోనూ హరిజనులు కన్పిస్తారు.

లలితసంగీతంలో "రైల్వేకోడూరు" అనే గ్రామానికి చెందిన ఎస్. నరసింహులు చక్కని పాటగాడు. అలాగే రంగస్థల సంగీతంలో "కనకం" చెప్పుకోదగ్గపేరు. (ఇంకా తెలియని వారెందరో ఉండవచ్చు) మత సామరస్యానికీ సహనానికీ సంగీతకళను భక్త గాయకులు వాడుకొన్నారు. శైవభక్త గాయకుడైన "అప్పార్" ఒక తేవారంలో అంటాడు.

**"మూర్ఖుల్లారా! ఎందుకొచ్చివాదనలు ఈ శాస్త్రాల గురించి?**
**ఈ కులం, గోత్రాలు వీటిని ఏంచేసి కుంటారు."**

నమ్మాళ్వార్ అనే వైష్ణవ భక్తుడంటాడు, "అతడు చండాలుడైనా సరే, అతడు భగవద్భక్తుడైతే భగవదంశ అతనిలో ఉంటే, అతణ్ణి శిరసావహిద్దాం, అతని సేవకులుగా ఉందాం" అని.

"ఒక భక్తుణ్ణి నీజాతి ఏమిటని అడగవలసిన పనిలేదు" అంటాడు కబీరు.

**భక్త గాయకుల కులాలు**

| | |
|---|---|
| "హరిదాస కులానికి చెందిన కనకదాసుది | - యాదవకులం |
| మహారాష్ట్రంనకు చెందిన నామ్‌దేవ్‌ది | - దర్జీకులం |
| తుకారాం | - దుకాణదారుడు |
| కబీరు | - సాలెకులానికి చెందినవాడు |
| ఈయన గురువైన రాయ్‌దాస్- చెప్పులుకుట్టే కులానికి చెందినవాడు | |
| "చిలకమర్తివారు" | - హరిజనపాఠశాలలు |

***(డా॥ పి.యస్.అప్పారావు - ఆంధ్రప్రదేశ్ రాష్ట్రహరిజన మహాసభ ప్రత్యేక సంచిక)***

"1914 ఇండియన్ నేషనల్ కాంగ్రెసు చెన్నపురిలో జరిగింది. ఆ సమయంలోనే ఆండ్రసన్ హాలులో నిమ్నజాతుల ఉద్ధరణమును గూర్చి ఒక సభ జరిగింది. చెన్నపురి రాజధానిలో నిమ్నజాతుల గూర్చి ఎవ్వరెవ్వరెచ్చట ఏవిధంగా పనిచేస్తున్నారో తెలుసుకొనుటకు ఏర్పడిన సభ ఇది. ఆ సభలో చిలకమర్తి వారు తమ అనుభవాన్ని గూర్చి 20 నిముషాలు ఆంగ్లంలో ప్రసంగించి చివర "I am a blind man; I did this little work; I could not do more" అని చెప్పి వేదిక దిగబోవుచుండగా సభాధ్యక్షులైన నారాయణ మహేశచందావర్కర్ (బొంబాయి హైకోర్టు న్యాయమూర్తి) చిలకమర్తి వారి చేయిపట్టుకొని "Shake hand Mr.Narasimham, You are not blind, We are blind; అని చెప్పారు. నాటి మద్రాసు గవర్నరు కూడా

చిలకమర్తి వారిని ఎంతో గౌరవించారు. హరిజన్యాభ్యుదయం కోసం మొదటగా పాఠశాల పెట్టిన కీర్తి చిలకమర్తివారిదే;

## స్వీయ చరిత్రలో - చిలకమర్తి

"గొప్ప సమస్యల లోనిది యొకటి మనహిందూ దేశములో నిమ్నజాతుల వారు రమారమి ఆరుకోట్ల మంది యున్నారు. వీరి యవస్థ పశువుల యవస్థకన్న దీనముగ నున్నది. వీరి సంఖ్య క్రమ క్రమక్రమముగ తగ్గుచున్నది. ఏమన నొక వంక క్రైస్తవులు, మరి యొక వంక మహమ్మదీయులు వారిని చేరదీసి తమతమ మతములలో గలుపు కొనుచున్నారు. దీని కుత్తరవాదులెవరన్న నగ్రజాతులవారమని విర్రవీగుచున్న బ్రహ్మ, క్షత్రియ, వైశ్య, శూద్రులే. ఈ వర్ణములవారు పంచములు మొదలైన నిమ్మజాతుల చేత తమకు కావలసిన సేవలన్నియు జేయించుకొని వారిని ఇండ్లకు రానీయక దరికి చేరనీయక యంటరానివారనియు చెప్పరాని వారనియు వారి కసహ్యములైన పేర్లుపెట్టి హీనముగా జూచుచున్నారు. పశువుల మన ఇంట నుండవచ్చును. కుక్కలుండవచ్చును. కాని పంచములు మట్టుకు మన గృహావరణము లోనికి రాగూడదు. వారు మన పశువులను మేప వచ్చును. కాని మనము నోరు విచ్చి వారుతో మాటలనైన నాడజాలము. వారు భగవంతునిచే సృష్టింపబడిన మనుష్యులే యనియు, అగ్రవర్ణముల వారికున్నట్లే వారికి గూడ క్షుత్పిపాసలు, సుఖదుఃఖములు గల వనియు మనవారు తలంపరు. తలంచిన పక్షమున వారి నారీతిగ నుంచుదురా?"

**పూర్ణ కలశ ప్రదాతలు - బి.రామరాజు**

***(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర హరిజన మహాసభ ప్రత్యేక సంచిక)***

" ఒక సాధారణ చర్మకారుడు తన కుటుంబ సభ్యుల పక్షాన తనమిత్రుల దాయాదుల పక్షాన సమర్పించినదీ పూర్ణ ఘటము - పూర్ణకలశము. ఈ నాడది

మన ఆంధ్రదేశానికి పవిత్ర చిహ్నం. మన సమృద్ధికి మాంగళ్యానికి ప్రతీక" "అమరావతీ స్తూపం గొప్ప బౌద్ధ మత కేంద్రం గానే గాక దివ్య శిల్ప కళాఖండంగా రూపుదిద్దుకొన్నది. ఆంధ్రుల శిల్పకళా ప్రాభవానికి ఖండాంతర ప్రశస్తి కూర్చినది. అమరావతీస్తూపమే ఆస్తూపానికి చెందిన మనోహర కళాఖండాలెన్నో తెలుగుదేశము లోను, తెలుగు దేశము బయటా, విదేశాల్లోను, ఆంధ్రుల ప్రాచీన వైభవాన్ని మూగ నోములతో చాటుతూ ఉన్నవి. అటువంటి కళాఖండాలో "పూర్ణ కలశం" ఒకటి. ఈ పూర్ణకలశమే మన ఆంధ్రప్రదేశ్ లాంఛనంగా చిహ్నంగా మనం గుర్తించినాము. పోతే ఈ పూర్ణకలశం కళాఫలకం యిచ్చినదెవరు? పూర్ణకలశాన్ని గుర్తించి నామే కాని దాని ప్రదాతలను మరచిపోయినాము. ఆమహా దాత లెవరో చిత్తగిరిచండి. పూర్ణఘటమిచ్చి పోయిన ఆదిమాంధ్రుల శాసనం చదవండి."

"బాణ మయూర సత్పండిత ప్రకర సం
　　కాశు లౌటకు దివాకరుడె సాక్షి
ర్రామదాస కబీర నామదేవులతోడ
　　నుపమింప చోఖమేళొకడె సాక్షి
గౌతమీయాజ్ఞవల్క్య వసిష్ఠమునులకు
　　నుద్దియన నులోపియొకడెసాక్షి
సర్వసంర్వంసహా శాసకాదులతోడ
　　నుచ్చరింపగ నందు డొకడెసాక్షి"

"కవులు, భక్తులు, ఋషులను నవనిపతులు
మున్నగాగల విజ్ఞులు పుట్టినట్టి
వంశముల నంటరాదని పలుకు జనులు
దేశ విద్రోహకులు గాక దేశ హితులె"

- (కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డి)

## కులాల సమస్య - (డాక్టరు రామమనోహర లోహియా)

"వర్తమాన యుగంలో వాల్మీకి పరంపరకు చెందిన వారి కొరకే కుల వ్యవస్థ యొక్క శేషాధ్యయనం ఉన్నది. కులాల మధ్య వేర్పాటును కొనసాగిస్తునే సమానత్వం సాధించాలన్న మాట నిరర్థకం. కులాలు నశించాలి. వాటి సంజ్ఞలూ, సంకేతాలు కూడా నశించాలి. శూద్రులను, హరిజనులనూ, మోమిన్లననూ, ఆడవాళ్లనూ, యోగ్యతలు లేకపోయినా ఉన్నతపదవుల్లో అధిష్ఠింప చెయ్యాలి."

"అన్ని కులాలవారితో సామూహిక సహపంక్తి భోజనాలు కార్యక్రమాన్ని ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో విరివిగా జరిపించాలి. ఉన్నత కులాలకు చెందిన వారికీ తక్కువ కులాలకు చెందిన వారికీ మధ్య కులాంతర వివాహాలు విరివిగా జరిగితే తప్ప కులాల నిర్మూలనం సాధ్యం కాదు."

"వేలాది సంవత్సరాలుగా దళితులై వున్నటు వంటి వారి సంస్కారాలను మార్చడానికి వారికి ప్రత్యేకావకాశాలు కల్పించాలి. సమానత్వపు పరుగులో వారిని సమానం చేయడానికి వారికి అండదండలు అందించాలి. కులాలను కొనసాగిస్తూనే కులాల మధ్య సమానత్వం సాధించడానికి ప్రయత్నిస్తున్న వారున్నారు. కులాలు నశిస్తేనే కులాల మధ్య సమానత్వం సాధ్యం కులాలు నశించాలంటే దళిత కులాల వారికి ప్రత్యేకావకాశాలు, అసమాన అవకాశాలు సమకూర్చవలసి ఉంటుంది."

"డాక్టరు అంబేద్కరులో నుంచి పైకి వచ్చిన రూపంలో కాకుండా ఆ అగ్నిజ్వాల ఆత్మాభిమానం ఆత్మగౌరవం స్వాభిమానం రూపంలో పైకి రావాలన్నది నా కోరిక."

- (కులాల సమస్య - డా॥ రామమనోహర్ లోహియా)

అంటరానితనం కొందరు దుష్ట ప్రవర్తకుల కుటిల పన్నాగాల వలన కార్పణ్యా భావాల వలన ఈర్ష్యాద్వేషాల వలన తమ బ్రతుకులు పండించుకొనుటకు

ఈదౌర్భాగ్యా నికృష్ట కులాలను ఉద్దేశ్య పూర్వకంగా కల్పించినారన్న సత్యం తేటతెల్లమవుతుంది.

## వరాహపురాణము

ఈ దిగువఘట్టాన్ని తిలకించగలరు. తొలిపురాణ మైన వరాహ పురాణంలో లిఖింపబడిన రచన యిది.

ధర్మవ్యాధుడు, నిషాదుడు. ఇతని వియ్యంకుడు మతంగ మహాముని. వీరిరువురును అంటరాని తెగకు చెందిన వారేకదా! భక్తి మెరయ నిషాదుడైన ధర్మవ్యాధుడు విష్ణు నామ స్తవము సల్పి తద్విష్ణును సాక్షాత్కరింప చేసికొని ఆతని మన్ననలంది ఆశీస్సుల పొంది నాడు. వలయు వరాల్ని కోరుకొమ్మనియె. పుళిందుడైన నిషాదుడు ఇలా తనయా కాంక్షను వెలిబుచ్చాడు.

"‥‥.

నాకు నానందనులకు

దయసేయుమాత్మ విద్యాయుక్త సకలక

ళావత్కవిత్వంబు దేవ దేవ!

వసుమతిపైన ధవా నన్నుబుట్టింప

నూహగల్గిన ధర్మయుగమునంద

పుట్టింపు మద్వంశమున జనించిన వారి

విజ్ఞాన పరులగావింపుమంత

**"మీదనీ మేన లయముగా నాదరింపు**

**మనుచు ప్రార్థింప నోయి మహాకవీంద్ర!**

**వరములన్నియు నిచ్చితి వచ్చి నన్ను**

**గూడుమిప్పుడు నావుడు గూడెనతడు"**

ఇది ధర్మవ్యాధుని కోరిక. తన వంశం వారంతా కవులుగా విజ్ఞాన పరులుగా గావింపమని కోరుకొన్నాడు. విష్ణువు చేత అవును అనిపించుకొన్నవాడు. హరిజనత్వం ఈ మహాత్మునికి ఆపాదింపవచ్చునా? మూర్ఖులైన ఒకానొక వర్గం సృష్టించి ఘోర భయంకర మైన కులాన్ని అంట గట్టి ఆటలాడుకొనుట విజ్ఞతా యుతమైన సమాజం సహింపగలదా? కాని అలాగే జరిగినది.

" I had seen almost all countries in this world in my world tour. I came accross many upressed, suppressed and deppressed people. I studied their habits and their ways of living."

"I am rather surprised to find that there is no community any where in this world which can be compared to the untouchables of India, in whom I find the noblest qualities such as charity, kindness, generosity and pity for the suffuring."

"They are the poorest people in India and yet they are most charitiable people in India. We always find their localities flooded with not only ordinary but also with highclass beggeres who dress themselves with colourful clothes,"

"What makes these untouchables to come forward to share their very little with others?"

"There must be some un-known inherent --quality which still comesout even while they are starving."

"I believe that they belong to a noble race which might-have been conquerred and subjugated in the immemorial past and even though they were

deprinted of their riches and wealth, no body could deprive them of their noble qualities which are past and parcel their bodies and blood."

"Vivekananda had no love for the present -- day hereditary cast-system which is a hindrence to progress. His wide sympathy could not be confired with in its steel frame."

"Do you mean to say I am born to live and die one of those caste-ridden, superstitiones merciles, hypocritical, this is tie cowards that you find only amongst the educated Hindus?"

- ***Vivekananda.***

(నా ప్రపంచ పర్యటనలో దాదాపుగా ఈ ప్రపంచంలో ఉన్న అన్ని దేశాలూ చూశాను. క్రిందకు అణగ ద్రొక్కబడి నిరాశా నిస్పృహలకు లోనైన చాల మంది ప్రజలను నేను కలిశాను. వారి అలవాట్లనూ, జీవన విధానాలను నేను పరిశీలించాను. ఈ ప్రపంచంలో మరెక్కడా హిందూ దేశంలోని అస్పృశ్యులతో పోల్చదగిన ప్రజలు లేరని తెలుసుకోవడం నిజంగా నా కాశ్చర్యమేసింది. బాధలుపడే వారి పట్ల త్యాగం, కనికరం, ఔదార్యం, దయవంటి అత్యుత్తమమైన గుణాలు వారిలో నేను చూశాను.

"హిందూ దేశంలో వారు చాల బీదవారు. అయితే వారు దేశంలో అందరికన్నా చాలా ఎక్కువ దాతృత్వం కలవారు. వారు నివసించే ప్రాంతాలు సాధారణమైన వారితోనే కాక, రంగురంగుల బట్టలు వేసుకున్న ఉన్నతస్థాయి యాచకులతో నిండి ఉండటం మనం ఎప్పుడూ చూస్తుంటాం.''

"ఈ అంటరానివారు ముందుకురావడానికి ఇతరులతోపాటు కొంచెమైన

పంచుకోవడానికీ వీలులేకుండా ఎందుకయింది?"

"వారు ఆకలితో అలమటిస్తున్నా ఇప్పటికీ తెలియని ప్రకృతిసిద్ధమైన గుణం ఏదో ఒకటి ఉండి ఉండాలి."

"చాలా పూర్వకాలం క్రితంవారు ఒక గొప్ప తెగకు చెందినవారై ఉండి తరువాత ఎవరితోనో జయింపబడి లోబడి ఉండి ఉంటారు. వారు తమ ఆస్తులనూ, ఐశ్వర్యాన్నీ కోల్పోయినా వారి ఒంట్లో రక్తంలో అణువణువునా నిండి ఉన్న గొప్ప గుణాలను ఎవరూ పోగొట్టలేరు." (అనీబీసెంట్) (జన్మాంతర వైరమ్)

- డా॥ బోయి భీమన్న.

"వివేకానందుడు నేటి అభివృద్ధికి ఒక నిరోధంగా ఉన్న వంశ పారంపర్యపు కుల వ్యవస్థ పట్ల ప్రేమ లేకుండెను. దాని ఉక్కు చట్రంలోకి అమితమైన ఆయన దాక్షిణ్యం పరిమితం కాదు."

"కుల తత్త్వం మూఢ విశ్వాసం, దయా రహితత్వం, కృత్రిమత్వం, ఆస్తిక వాదం ఉన్న విద్యావంతులైన పలాయనవాదుల మధ్యలో నేను నివసించి చనిపోవడానికే పుట్టానని నీ అభిప్రాయమా?" ( Caste and Culture Socialism)

- వివేకానంద.

## వర్ణ భేదములోని విచిత్ర పరిణామము విస్మృతాంధ్రము

**- విశాలాంధ్రము**

**- దిగవల్లి వేంకట శివరావు**

"వర్ణములలో హెచ్చు తగ్గులు లేవు. జగత్తు అంతా బ్రహ్మమయము. మొదట సృష్టింపబడిన బ్రాహ్మణులు సదా కర్మముచే వర్ణమును పొందిరి".

కర్మభోగములందు ప్రీతి చెంది క్రూరులై, క్రోధము కలిగి, ప్రియసాహసులై, స్వధర్మములను ఏ బ్రాహ్మణులు విడిచిపెట్టిరో, ఎట్టిని శరీరము గలవారో ఆ బ్రాహ్మణులు క్షత్రియులైరి. గోవుల పాలన వృత్తిని చేయుచు కృషిచేసి జీవించువారై పసుపు వర్ణము కలిగిన యే ద్విజులు స్వధర్మము ననుష్ఠించుటలేదో వారు వైశ్యులైరి. లోభముగలిగి అన్ని కర్మలను చేయుచు జీవించుచు శౌచములేని వారై నల్లని దేహము కల్గిన ద్విజులు శూద్రులైరి - అనిమహాభారతము -శాంతి పర్వము 188 అధ్యాయములోని 10-13 శ్లోకములు చెపుతున్నవి.

## పెద్దింటివారు (పంచముల చరిత్రము)

*- (జి.యస్.బి. సరస్వతీస్వాములు)*

"శ్రీ మచ్ఛంకర భగవత్పాదుల కాలము నుండి అనార్య ప్రాబల్యము నశించినందున" పెద్దింటివార"ను వాక్యార్థమును కడద్రోచి గ్రామబహిష్కరు లనినను, అంటరాని వారనినను, సిద్ధాంతమై ప్రతి మానవుని హృదయ సీమలోను నిండి నిబిడీ కృతమై తాండవమాడుచున్నది."

("నాటి నాగులే నేటి దళిత జాతులు" గ్రంథములో భూపతినారాయణ మూర్తి)

"శ్రీకృష్ణ దేవరాయలు ఈ దేశానికి (ప్రాంతానికి) వచ్చినపుడు తనతల్లి తద్దినము పెట్టవలసినపుడు ఉత్తమకులం వారిచే వంటచేయించమని చెప్పెనట. దీనితో మంత్రి తిమ్మరుసు పెద్దకులం వారిచే వంటచేయించమని ఆదేశించగా ఆనాడు పెద్దకులంగా పిలువబడే పంచములచే (ఇప్పటికి మన తెలుగు నాట కొందరు మాల మాదిగలను పెద్ద కులంగా పిలుస్తారు) వంట చేయించెను. ఈ విషయం తరువాత బయటపడగా అప్పుడు ఆపంచములందరికి జందెంలు వేయించి బ్రాహ్మణులుగా మార్చడం జరిగింది."

## ఈ సమాజ దుష్టత్వం పతనంకాక తప్పదు
## - రాహుల్ సాంకృత్యాయన్

"భారతీయులందరూ ఒకే జాతికి చెందిన వారని, వారు హిందువులైనా, ముస్లిం లైనా, క్రైస్తవులైనా, సిక్కులైనా, బౌద్ధులైనా, మతనిష్ఠులైనా, మతాతీతులైనా విదేశాలకు ఎక్కడకు వెళ్లినా మనం భారతీయులనే పిలవబడతాం. కులమత భేదాలను నిర్మూలిం చడం వలన మనదేశ భవిష్యత్తు ఉజ్జ్వలంగా ఉంటుందనడంలో సంశయం లేదు."

"తెలుగు సాహిత్యంలో దళిత జనోద్ధరణ " శ్రీ జె. అమ్మలయ్య (అమూల్యశ్రీ)

"మహాభారతాన్ని - వేదాలకు బ్రహ్మసూత్రాల్ని - భగవద్గీతను రచించిన - వ్యాసుడు

హిందువులందరికీ పరమ పవిత్రమైన రామాయణాన్ని రచించిన - వాల్మీకి

బ్రహ్మర్షి పరాశరుడు

మతంగ మహాముని

మహాసాధ్వి అరుంధతీదేవి

త్రిశంకుడు

జాంబవంతుడు

వీరబాహుడు (కాటి)

కర్దమ ప్రజాపతి

తిరుప్పాణియాళ్వారు

మంగళాయాళ్వారులు

మాలకన్నమదాసు

భక్తనందనార్ వీరంతా బహిష్కృతజాతికి (పంచమ) అయినవారు.
వీరిని లోకము ఆరాధించడం మాని వేసిందా?

ఈ అస్పృశ్యతాజాడ్యమును నిరసించి హైందవము నుండి పారద్రోలడానికి,

చార్వాక లోకాయతలు

వర్ధమానుజైను

గౌతమ బుద్ధుడు

శ్రీ రామానుజాచార్యులు

కల్యాణ బసవేశ్వరుడు

స్వామి దయానందుడు

రాజారామ్ మోహనరాయ్

స్వామి వివేకానంద

పల్నాడు బ్రహ్మనాయడు

పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి

యోగి వేమన

ఈ వర్ణవ్యవస్థను రూపుమాపుటకు సంఘసంస్కరణోద్యములు లేవదీశారు. కాని ఈ అస్పృశ్యతను రూపుమాపలేక పోయారు. వైష్ణవ, శైవ మతాలు పోటీపడి అంత్యాజుల్ని తమతమ మతాలలో కలుపుకున్నా ఈ అంటరానితనం అడుగంటలేదు. సరిగదా ఆకాశాన్ని అంటుకున్నది. "బ్రాహ్మణులకు పీటలు - మాలలకు మంచాలు" అమరుతాయని తమ కాలజ్ఞానతత్త్వాలలో చాటి చెప్పినా

(పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి) ఈవర్ణవ్యవస్థ మారలేదు.

## వేమన

విప్లవాత్మకమైన వేదాంత బోధనలతోపాటు ఆనాటి సమాజంలో వున్న హెచ్చు తగ్గుల్ని కులమతాల కుటిలత్వాన్ని గట్టిగా నిరసించాడు.

**"కులము హెచ్చు తగ్గు గొడవలు పనిలేదు**
**సానుజాతమయ్యె సకల కులము**
**హెచ్చు తగ్గు మాటలెట్లెరుంగగ వచ్చు."**
**కులాల్లోని ఉచ్ఛ నీచాల్ని నిరసించాడు.**
**"మాల వానినేల మహిమీద నిందింప**
**నొడల రక్తమాంస మొకటి గాదె**
**వానిలోన మెలగు వానికులంబేది?"**

ఏ కులంవాడైనా అందరిలోనున్న రక్తమాంసాలు ఒకటేకదా అన్న తత్వాన్ని చెప్పాడు.

**"మాలమాల కాడు మహి మీదనే ప్రొద్దు**
**మాట దిరుగవాడె మాల గాక**
**వాని మాల యన్న వాడెపో పెనుమాల."**

అన్న మాట నిలబెట్టుకోని వాడు - మాలవాణ్ణి తూలనాడే వాడే అసలు మాల అని నిష్కర్షగా చెప్పాడు వేమన

**"మాదిగ యనగానె మరి తక్కువందురె**
**మాదిగెయిల సురుల మామగాదె**
**మాదిగకును బిడ్డ మన యరుంధతి గాదా!"**

- వసిష్ఠుని భార్య అరుంధతి - అరుంధతీ కులస్థులు కాదా

ఇక్కడ వేమన యోగి - ఇంద్రునికి అహల్యకు పుట్టిన
వాలిసుగ్రీవుల జన్మాన్ని గూర్చియో - లేక అహల్యకు
దేవేంద్రునకు పుట్టిన శతానందుని గూర్చియో -
సురలకు మాదిగయె మామ అంటున్నాడు.

*- గురజాడ అప్పారావు (లవణరాజు కలలో)*

**మలిన దేహుల మాల లనుచును**
**మలిన చిత్తుల కధిక కులముల**
**నెల వొసంగిన వర్ణధర్మ**
**ధర్మ ధర్మంబె!**

కేవలం అశుభ్రంగా వున్నారన్న కారణంగా సాటిమనిషిని మాలగా నీచంగా చూచే అగ్రవర్ణ వ్యవస్థ ధర్మమైనదిగాదు. అధర్మమైన దంటాడు గురజాడ.

**మంచి చెడ్డలు మనుజులందున**
**యెంచి చూడగ రెండె కులములు**
**మంచియన్నది మాలయైతే**
**మాలనేయగుదున్**

గుణాన్ని బట్టి కులం కనుక - మంచి యన్నది మాల యైతే తాను మాల నౌతా నంటాడు.

"(జ్ఞానానందకవి) "తమాషా" (వంశధార) అనే కవితలో ఈ అస్పృశ్ యే వేదంలో వుందో "దొమ్మ"లుంటే చెప్పండని హిందువులను నిలదీస్తున్నా

**"ఏవేదాన లిఖింపగా బడినదోయీ! యంటరానట్టివ**
**ర్ణావిర్భావము దొమ్ములున్నయెడ వ్యాఖ్యానింపు మీర్వాళువై**

యేవేవో కుటిలంపు భావములతో నీయైదు వేలేండ్లు హిం
సా విక్లిష్టములోన ముంచుచు తమాషా గాంచి హర్షింతువా!"

అని హైందవుణ్ణి - యిది తమాషా యనుకొన్నవా యని నిలదీసి అడుగుతున్నాడు. నీ యాధిక్యం నిల్వ బెట్టకొనగా నీ విట్లు ద్వేషమ్ముతో నీ యస్పృశ్యత నేర్పరించితివి అని కడిగేస్తున్నాడు.

"కిటుకులు కుంభకోణములు కీడును సేయని నిష్కళంక హృత్పుటములు గల్గు జాతిని నధోగతిన్ దిగ ద్రోశారన్న భావాన్ని బాధను వ్యక్తం చేస్తున్నాడు.

"ఇది యమానుష చర్య లేదీజగాన
నంటరాని తనమ్ము హైందవము నందు
గాక, యీ మహా దారుణ కాండ యిటులె
నిలిచి యున్నచో దేశమ్ము నేలగలియు"

అ అస్పృశ్యత అన్నది హిందూ సమాజంలో తప్ప యింకెక్కడుంది? ఇది రూపు మాపనిచో యీ దేశమేమైపోతుందని వ్యధ చెందుతున్నాడు కవి.

పెద్ద తనము చేత పెద్దింటి వారైరి
పెద్ద తనము చేత కొద్దియైరి

పెద్దతనంవల్లనే ఒకానొకనాడు పెద్దింటివారైన నిమ్నజాతులు ఈనాడు కొద్ది వారైరి. అంటే చాలా చిన్న చూపు చూడబడే వారైరి.

ఏనాడు నాజాతి జ్ఞాన ప్రసూనాలు
కాయలై ఫలసిద్ధి గాంచగలవొ
ఏనాడు నాజాతి పృథుల భోగముధరా

భాగాన లభియించి వరల గలదొ
ఏనాడు నాజాతి మానుషత్వ మొకింత
యున్నత స్థానమ్ము నూనిమనునొ
ఏనాడు నాజాతి నాణెంపు రాణింపు
వెలుగొంద దళత్తళల మనునొ
కాల రథ చక్ర భీషణ గమనమందు
మంచి రోజులు నేనాడు వించు మనునొ
పలుకరించిన సడి సన్న తెలుగు కవిత
నాడు తోరాన నాదు ఘంటము లిఖించు

తన దగాపడ్డ దళిత జాతి ఏనాడు బాగుపడుతుందోఅని అ్రులుచాస్తూ ఆ మంచి రోజు కోసం తనఘంటం ద్వారా కవితాధార కురిపిస్తానంటాడు జ్ఞానానందకవి.

హిందూదేశానికి (భారత) తీరనిమచ్చగా నిలిచిన యీకుల వ్యవస్థను కూకటి వ్రేళ్ళతో సమూలంగా నాశనం చెయ్యాలని కంకణం గట్టుకొన్న మహామహుల సంస్కార హృదయుల ఆశలు ఆశయాలు నెరవేరినపుడు దేశప్రగతికి, సమైక్యానికి సహనానికి అత్యంత శుభోదయానికి ఆనందనాందీప్రస్తావన.



## అస్పృశ్యతా నివారణ సందేశము

"జన్మమ్ము చేరాదు సద్గుణాలని యన్న
"రామకృష్ణ" నమోఘ రమ్య వాక్కు
చెప్ప వేదాల నస్పృశ్యత లేదన్న
ఘన "వివేకానంద" ముని హితోక్తి

అనుకొన్నచో దేశమునకు భారంబన్న
ధారుణీ సుకవి "ఠాగూరు" మాట
తలపగా నిద్ది హైందవ శరీరమునకు
వ్రణమన్న "తిలకు" యోధుని వచస్సు"

"అంటరాని తనము గెంటక పోయిన
ఘోర కృత్యమన్న 'గాంధి' పలుకు
ప్రగతి భారతమున పాటించి ప్రభుత య
స్పృశ్యత తొలగింప సిద్ధపడియె"

"తినుట కేమి లేని దీనుండు గ్రామాల
నెక్కడో వసించు దిక్కులేని
పేదవాడు తనదు పెదవులు విప్పిసం
బరము పడుచునున్న వాడు నేడు"

"క్రుక్కడి మృగముల కంటెను
తక్కువగా జూడబడిన దైన్యపు కులమున్
మక్కువగా జూచినవా
రెక్కాలమునైన నుందురీ ధారుణిలో"

"కుక్క తిరుగవచ్చు కోరినచోట్లకు
పంది తిరుగవచ్చు నెందయినను
హరిజనుండు నెటకు తిరుగరాదని యెదు
పలుకు భగ్నమయ్యె వాస్తవముగ"

"పతిత జనాళికోసరము వందలు వేలు ప్రణాళికల్ మహో
న్నతముగ నీప్రభుత్వము ఘనమ్ముగ సేయుచు నున్న దిప్పుడీ
వితములు పంచమీయులకు వేడుక లయ్యెను గోచిలేని జీ
వితములు పూచి కాచినవి వెన్నెల పంటలు సందడింపగన్"

"నాడు సరస్వతీ సతి కనాథునిగా గనబడ్డ వాడె యీ
నాడు సరస్వతీ సతికి నాథుని బంధువుగా గనంబడున్
తేదగ్రహించుచో ప్రభుత తేకువ మీఱగసల్పుచున్న యీ
వాడల శాంతి విప్లవపు భావ ప్రణాళికలే నిదానముల్"

"తలను దాచుకొనగ నిలయమ్ములేనట్టి
మాల మాదిగలకు వేలకొలది
యిండ్లు కట్టబెట్టి యిచ్చిరి మఱియు నిం
కిచ్చు చున్న వార లిచ్చు వారు"

"తర తరాల నుండి ముఱికి జీవితమున
కునికి యంటరాని తనపు టడుసు
బొరలినట్టి పేద హరిజనావళికిప్పు
డమరు చున్నయవి సహాయ సుధలు"

"న్యాయవాది, వైద్యు డాతండు పాండితీ
విభవమున్న వాడు విశ్వ జనత
చేత మ్రొక్కులందు శ్రేష్ఠుండు విజ్ఞాని
హరిజనుండు నేడు సిరిజనుండు"

"ఈ యస్పృశ్యత మున్ను వేదముల యందేకాని వేఱొండు గా
నీ, యెందైనను లేదు మానవుడు దీనిన్ స్వార్థ చింతాత్ముడై
చేయం జాలెను నేటి మానవుడు ఛీఛీ యంచు పోద్రోలనీ
హేయంబై నటువంటి భావమును పోయెన్ ధీర మర్త్యాళికిన్"

"ప్రథమ కావ్య కర్త వాల్మీకి వ్యాసుండు
నల వసిష్ఠుడతని చెలువ మిన్న
రక్త బాంధవమున రాజిల్లు హరిజన
కులమునకును బందుగులు వచింప"

"పొరలు పొరలుగా గ్రమ్మిన బూజునంత
దులుపు కొన్నారు హరిజన కులము వారు
తెరలు తెరలుగా వచ్చిన తెలివి నంత
కలుపు కొన్నారు పెద్దింటి కులము వారు"

"ప్రభుత కల్పించు భాగ్యాల రాశి గొనుచు
హరిజనావళి ముందుకు నరుగునాడు
వారిలో వారి కైక్యమ్ము వఱలు నాడు
బాగు పడియెదరీ విశ్వభాగమందు"





Dr. S.T. Gnanananda Kavi

- The blessed poet, Gnanananda Kavi is my disciple. He is unmistakably, the best of the poets of recent times. He is a great poet with the unique ability of writing "Sisa Padyas" in an appealing way.

  *- Kavi Samrat, Gnanapeeth Awardee,*
  *Padmabhooshan, Viswanatha Satyanarayana.*

- *"Dr. Gnanananda Kavi* is a renowned popular poet in word, deed and thought. He reflects the chaste Telugu idiom and dignity. He has surely, inherited the unique poetic virtues of Srinatha and Jashua, especially in the field of composing "Sisa Padyas"

  *- Gnanapeeth awardee, Padmabhooshan,*
  *Dr. C. Narayana Reddy.*

- "The nation, in course of time, will un doubtedly, recognise your stature for go a head.

  *- Navayuga Kavichakravarthy Padmabhooshan*
  *G. Jashua.*

- "Dr. Gnanananda Kavi is one of the great men of Literature who had brought glory to Telugu Poetry.

  *- Dr. B. Gopala Reddy,*
  *Former Chief Minister.*

- "You have acquired the gift of writing poetry by birth and your verse embodies all the significant trends of the Telugu Poem for over a thousand years.

  *- R.S. Sudarsanam.*

Ramsha-Siriesha Publications, Samalkot. Phone : 27474.